


# Bala Ramayanam.

# బాల రామాయణము.

గ్రంథకర్త

వాసుదేవ ఆర్. హాసబ్నీస్



 0-6-0.





Bala Ramayanamu

# బాలరామాయణము.



ఇది

వాసుదేవ ఆర్. హసబ్నీసుగారిచే

Vasudeva R. Hasabnis



రచియింపబడి.

బళ్లారి

యం. [illegible] శర్మ అండ్ కంపెనీవారిచే
M. [illegible]

స్వకీయ

కామేశ్వరీ ముద్రాలయమున

ముద్రించి ప్రకటింపబడినది.

**1915.**

శ్రీ

# పీఠిక.

---

నే నీనడుమ "బాలభారత" మనుపేర మహాభారత చరిత్రమంతయుఁ దేటతెనుఁగున వచనమున వ్రాసియుంటిని. అయ్యది ముద్రితమై కొంతకాలమయ్యెను. దానిఁ బఠించిన యనేక విద్యార్థు లీచిన్నపొత్తమును బొగడి, యియ్యది ప్రత్యాంధ్ర బాలబాలికలకు మిక్కిలి యుపయోగకారి కాఁజాలు నని యభిప్రాయమిచ్చిరి. విద్యాశాఖాధికారులు కొందఱు సైతము దీనినిఁ బ్రాథమిక విద్యాశాలలలోఁ బఠనీయగ్రంథముగ నెన్నుకొనియున్నారు. ఈచిన్నపొత్త మందఱి ప్రీతికిఁ బాత్రమయి యుండుటచే నన్ను "బాలరామాయణము" వ్రాయఁ బురికొల్పినది.

రామాయణ చరిత్రమును బాలబాలికలకుఁ దెలియు రీతిని వచనమునఁ గ్లుప్తముగ వ్రాసి నేఁటికిఁ బ్రచురించియున్నాను. సంస్కృతమునను నాంధ్రమునను నీభారతరామాయణములు కలవు; కాని, యయ్యవి పండితులకే కాని పామరజనులకును బాలబాలికలకును దెలియుట కష్టమయియుంటచే, నేనా చరిత్రములనీరీతి వ్రాసితి. ముఖ్యముగా నీచరిత్రములు బాలబాలికలకుపయుక్తముగా నుండవలయుననుటయే నాముఖ్యోద్దేశమగుటంజేసి వీనికి "బాలభారతము" "బాలరామాయ

ణము" అనియుఁ బేరులిడితిని. ఆపేరులు సార్థకమగుగాక! అని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాఁడను.

"బాలభారతముఁ" బఠించిన మహామహులనేకు లొసఁగిన సదభిప్రాయములీపత్త్రమున నిముడ్చియున్నాము.

"బాలభారతము" వలెనే యీ "బాలరామాయణము" సైతమావిద్యార్థికుల సదభిప్రాయములకుఁ బాత్రమగుగాక! అనికోరుచున్నాను.

విద్యాశాఖాధికారులీచిన్నపత్త్రములనుఁ బ్రాథమిక విద్యాశాలలలోఁ బఠనీయగ్రంథముగ నియమించి నన్ను గృతార్థునింజేయుదురుగాక! అని ప్రార్థించుచున్నాను.

మాతాపితరులెల్లరు నీపత్త్రములఁ దమబాలబాలికలచేఁ జదివించి వారిని నీతిపరులనుగాఁ జేయుదురుగాక!

గుంటూరు
22-7-1915.

ఇట్లు: విద్వజ్జనవిధేయుఁడు,
గ్రంథకర్త.





# —* బాలరామాయణము. *—

పిల్లలారా! రామాయణములోని కథలన్నిటిని మీకు కొన్నిమాటలలో చెప్పవలెనని యెంచియున్నాను. దానిని మీరు శ్రద్ధతో విని, యందలి ముఖ్యోపదేశములను నేర్చుకొని, దైవభక్తులై, పెద్దలయెడ భక్తితోను, అనుకూలతతోడను, ప్రవర్తించి శ్రీరామచంద్రునివలె మీరును కీర్తిమంతులై, సుఖము, ఐశ్వర్యముబొంది, లోకమునకుపకారము చేయుచు మనుదురుగాక!

రామాయణకథను ప్రారంభించుటకుముందు కొన్ని విషయములు మీకు చెప్పవలసియున్నవి. అవియు ముఖ్యములైనవియె. వినుడు.

రామాయణము సంస్కృతభాషలోగల యుత్తమతమములైన గ్రంథములలో ఒక్కటిగాను వెలయుచున్నది. ఈ రామాయణము సంస్కృతములో శ్రీవాల్మీకిమహర్షులు విరచించిరి. "రామాయణము" అనగా శ్రీరామునిపుట్టుక మొదలుకొని కొనవరకు జరిగిన చరిత్రము వ్రాయబడియున్న గ్రంథము. ఈ రాముడెవ్వడు? మీకు తెలియునా?

పూర్వ మయోధ్యానగరమున దశరథుడను రాజు పాలించుచుండెను. అతని పెద్దకుమారుడు రాముడు. ఈతడు గొప్పవీరుడు. దుష్టులగు రాక్షసులనేకులనుజంపి, సాధుజనులను దుష్టులబాధనుండి తప్పించెను. ఈతనికథయే మీకిప్పుడు చెప్పబోవుచున్నాను. ఈకథకే రామాయణము అని పేరు. ఈ గ్రంథములో ఏడుప్రకరణములున్నవి. ఈ ప్రకరణములకు కాండములు అని పేరు. అవియేవనగా (1) ఆదికాండము, లేక బాలకాండము; (2) అయోధ్యాకాండము; (3) అరణ్యకాండము; (4) కిష్కింధాకాండము; (5) సుందరకాండము; (6) యుద్ధకాండము; (7) ఉత్తరకాండము; ఈ కాండములకు పేరులు ఆయాప్రకరణములలో చెప్పబడియుండు కథలను అనుసరించి పెట్టబడినవి. ఇంక ఒక్కొక్క ప్రకరణములోను చెప్పబడియున్నకథను చెప్పెదను, శ్రద్ధతో వినుము.

---

# 1. బాలకాండము.

(ఈ కాండములో శ్రీరామునిపుట్టుకయు, అతని చిన్నతనపు చేష్టలును మొదలగునవి వర్ణింపబడియున్నందున ఈ కాండమునకు "బాలకాండము" అని పేరుపెట్టబడియున్నది. అదిగాక ఇదియే చరిత్రమునకు ప్రారంభమగుటవలన ఈ కాండమునకు "ఆదికాండము" అను పేరుకూడకలదు.)

సరయూనదీతీరమున అయోధ్యానగరమను చక్కని పట్టణముకలదు. అనేకసంవత్సరములకు పూర్వము పూర్వమునకు ఇక్ష్వాకుడను రాజు రాజ్యమేలుచుండెను. అతడు చాల గొప్పవాడు. ఈతనియనంతరము అయోధ్యానగరమును పాలించిన యీతనివంశమునపుట్టిన రాజులకు ఇక్ష్వాకుకుల రాజులని పేరు. ఈప్రసిద్ధమయిన ఇక్ష్వాకువంశమున దిలీపమహారాజు, అజమహారాజు, దశరథమహారాజు, అని పేరులు గల గొప్పరాజులవలె, పరాక్రమవంతులును, ప్రజలను బాగుగ పాలించువారునునైన అనేకమహారాజులుదయించిరి. ఇప్పటి కాలమున (అనగా ఈరామాయణకాలమున) దశరథమహారాజు రాజ్యభారమునువహించి, ప్రజలను తనకన్నబిడ్డలవలె భావించి, వారిసౌఖ్యములె తనసుఖములుగనెంచి, అన్నివిధములను న్యాయమార్గమును అవలంబించి, పాలించుచుండెను. అతని కన్నిసంపద లుండెను, గాని పుత్రసంపదయొక్కటే తక్కువ. లోకములోని వారందఱును అన్నివిషయముల యందును సౌఖ్యముగ ఉండరుగదా! ఏదో ఒక్కటి కొఱతగా ఉండును. అట్లనే ఈ దశరథమహారాజునకు అన్నివైభవము లుండినను పుత్రవైభవముమాత్రము లేదు. అతనికి బిడ్డలు లేని విచారము బాధించుచుండెను. ఆయనకు కౌసల్య, కైకయి, సుమిత్ర అని ముగ్గురు భార్యలుండిరి. ముగ్గురికిని సంతానములేదు. కావున దశరథమహారాజు పుత్రులకొరకై

ఎన్నియో యజ్ఞములును, దేవపూజలును, సంతర్పణములును, మరియును అనేకవిధములగు పుణ్యకార్యములును చేసెను. పరమేశ్వరుని కృపవలన కౌసల్యకు రాముడును, కైకయికి భరతుడును, సుమిత్రకు లక్ష్మణుడును, శత్రుఘ్నుడును జన్మించిరి. శ్రీరాముడు చైత్రశుద్ధనవమినాడు పుట్టెను. కావుననె [illegible] చైత్రశుద్ధనవమికి శ్రీరామనవమి అని పేరుపెట్టి ప్రతిసంవత్సరమును ప్రతివారును శ్రీరామ జననోత్సవముచేసి ఆనందించుచు, శ్రీరామునియెడ తమకుగల భక్తిని విశదపఱచుచున్నారు. ఈ నాల్గురు పుత్రులలోను శ్రీరాముడు పెద్దవాడు. దశరథమహారాజుకు బిడ్డలుపుట్టినందున ప్రజలందఱును మిక్కిలి సంతోషించిరి. బ్రాహ్మణులకు గోదానము, భూదానము, సువర్ణదానము, మొదలుగాగల దానములనేకములు మహారాజు చేసెను. ఈ పిల్లలు పెరుగుచు దినదినమును పెద్దవారగుచు, తల్లిదండ్రులను సంతోషపెట్టుచు పెరుగుచుండిరి.

## విద్యాభ్యాసము.

బిడ్డలెల్లరు మెల్లమెల్లగ పెద్దవారలై, తప్పటడుగులు పెట్టుచు, వచ్చియురాని ముద్దులమాటలాడసాగిరి. అన్నతమ్ములు నలువురు నొక్కచోటనెకూడి ముచ్చటగ ఆడుకొను

చుందురు. ఒక్కచోటనె భోజనము సేయుదురు. ఒక్కచోటనె పరుండుదురు. ఒక్కనిముసమైనను ఒండొరులను విడిచియుండలేరు. మిక్కిలి మైత్రితో మెలగుచుండిరి. వీరందఱు నింతస్నేహముతో ఉండుటనుగూచి తల్లితండ్రులును, తక్కిన పరిచారకులును, ఇతరజనులును, ఆనందసాగరమున మునుగుచుండిరి. వీరందఱును ఇంతస్నేహముగ ఉండినను రామునిపై లక్ష్మణునకును, భరతునిపై శత్రుఘ్నునకును, మిక్కిలిప్రేమయు భక్తియు కుదిరియుండెను. అందువలననె ఎవరైన నిరువురు చాలాస్నేహముగా ఉండిన రామలక్ష్మణులవలె ఉన్నారు అని మనము నుడువుచున్నాము. భరతశత్రుఘ్నులును అట్లేవారే. వీరందఱును చిన్నప్పటినుండియు మిక్కిలియణకువ కలిగి, తల్లితండ్రుల యాజ్ఞలమేరకు ప్రవర్తించుచుండురు. పెద్దవారియెడ భక్తియు, చిన్నవారియెడ ప్రేమయు, గలిగియుండెదరు. వీరికి తగినవయసున విద్యాభ్యాసము చేయింపవలెనని వారిని కులగురువగు వసిష్ఠులయొద్ద విడిచిరి. గురువు వీరికి వ్రాయుటకును చదువుటకును మొదట నేర్పి, మెల్లమెల్లగ సకలశాస్త్రములును నేర్పెను. ఆదేవిధముగ ప్రతిదినమును దేహపరిశ్రమచేయుట, గుఱ్ఱపుసవారిచేయుట, గురిచూచి బాణములు సంధించుట, మొదలగు అనేకవిద్యలును నేర్చుకొనిరి. ఋషి కేవిధముగా విద్యలనేర్పించుచుండెనో ఆవిధముగానె శరీరమునకుగూడ పరిశ్రమ నేర్పినందున ఈ రాజపుత్రులు విద్యా

వంతులును, చురుకుదనముకలవారును అయిరి. మఱియు ధైర్య వంతులును, దేహపుష్టికలవారున్నై క్షత్రియులకు ఆవశ్యక మగు యుద్ధకలలయందును వారు నేర్పరులైరి. గురువుగారి యెడ వీరు భక్తివిశ్వాసములుకలిగి, వారుచెప్పినట్లు ప్ర వర్తించుచుండినందువలననె పెరికన్నివిద్యలును శీఘ్రములోనే పట్టుబడి వీరువిద్యావంతులైరి. కావున, పిల్లలారా! మీ రును మీగురువులవారుచెప్పినట్లుప్రవర్తించుచు, వారుచెప్పిన పాఠములను శ్రద్ధతోవిని, ఇంటికిపోయినపిదప ఆపాఠముల ను మరల చదువుకొని, గురువుగారికి ఒప్పగించి, ఈ రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులవలె ఒక్కరిమీనొక్కరు ప్రీతిగలిగి ప్ర వర్తించినయెడల మీరును వారివలెనె విద్యావంతులై, బుద్ధి మంతులై, కీర్తిమంతులౌదురు.

విశ్వామిత్రుడు వచ్చుట.

తనకొమరులు విద్యావంతులౌట గని దశరథమహా రాజు సంతోషమనుసాగరమున మునుగుచుండెను. పుత్రులపై తనకు మునుపున్న ప్రేమకన్నను ఇప్పుడు ఎక్కువప్రేమ పుట్టెను. ఇట్లుండగా ఒక్కనాడు అకస్మికముగా విశ్వామి త్రుడను ఋషీశ్వరుడు దశరథుని సభకువచ్చెను. దశరథుడా వచ్చినమునిని సన్మానించి, కూర్చుండబెట్టి, చేతులు జోడించు కొని "దేవా! తమకు నాచేకావలసిన కార్యమేదియో

యోసితిండు" అని వినయముతో ప్రార్థించెను. అందునకు విశ్వామిత్రుడు "రాజా! నేను యజ్ఞముచేయుటకు మొదలుపెట్టియున్నాను. ఆయజ్ఞమును పూర్తికానీయక దుష్టులగు రాక్షసులు మధ్యమధ్య విఘ్నములుకల్పించి, యనేకవిధములుగ బాధించుచున్నారు. యజ్ఞయాగము సంరక్షణసేయుట రాజధర్మముకాదా? కావున, ఆరాక్షసులబారినుండి మమ్ముర క్షించుటకును, యజ్ఞమును పూర్తిగాజేయుటకు విఘ్నములు కలుగకుండునట్లు చేయుటకును, సకలశస్త్రాస్త్ర విద్యాకుశలులును, యుద్ధకలాప్రవీణులును అయిన రామలక్ష్మణులను మీయిరువురుపుత్రులను నాతో బంపింతురని నమ్మి ఇటువచ్చినాను. ఇదియేనాకోరిక." అని వచించెను. ఈమాటలువినగానె రాజునకు మిక్కిలి విచారముకలిగెను. లేకలేక కలిగినపుత్రులను ఇప్పుడెడబాయవలెగదా! అందునను, దుష్టులగు రాక్షసులెక్కడ, సుకుమారులగు నాకుమారులెక్కడ! విశ్వామిత్రునంతటివానినే లెక్కసేయక బాధించు ఆరక్కసులు పసిబాలురగు రామలక్ష్మణులకు వెరతురా? ఈ చిరుతకూనలు మానవభక్షకులనుజూచి భయపడరా? ఆ నిశాచరులీ పిల్లలను ఒక్కొక్కనే మ్రింగివేయరా? అప్పుడు బిడ్డలు కలిగియు పుత్రోత్సవము లేకపోవుగదా! అయ్యో! ఇప్పుడేమిచేయవచ్చును? నాకన్నబిడ్డలు నాకన్నులయెదుట లేకున్న నేనెట్లుందును? కన్నతల్లులెట్లుందురు? ఇన్నిమాటలేల? నా

రాముడు నాయెదుట లేకపోయిన నేబ్రతికియుండియు శవము నంటివాడ నేకదా! అని యనేక తెఱఁగుల మనసులో విచారించి, తుదకు విశ్వామిత్రునితో "స్వామీ! మీయాజ్ఞకు విరుద్ధముగా నడచువాడ నే? అయినను, దీర్ఘకాలము సంతాన రహితుడనై యుండి, ఋష్యశృంగుని కృపచే పుత్రవదనము ననుభవించుచున్నవాడను. ఇంతలో నాయొద్దనుండి నాకుమారులను దూరముచేయుటకు నామనసొప్పకున్నదికదా! కావలెనన్న, నామంత్రులను, యుద్ధకళాకౌశలులగు నాసైనికులను మీవెంట యజ్ఞసంరక్షణార్థమై పంపెదను. అదియునుగాక, పసిపిల్లలగు నాబాలకులెడ, మాయావిశారదులగు దుష్టరాక్షసులెడ? వారు వీరినిజంపి, మీయజ్ఞమును రక్షణసేయుటెడ? ఇది వారికి సాధ్యమే? కావున, వలయునన్న నేనే సైన్యముతో వచ్చి మీ యజ్ఞము పూర్తియగువరకు నుండెదను." అని యనెను. అందునకు విశ్వామిత్రుడు "రాజా! నీయజ్ఞానమువలనను, పుత్రమోహమునను రామలక్ష్మణులపరాక్రమము నీవెఱుగకున్నావు. దుష్టదానవుల వంశములను నాశముచేయబుట్టిన రాముని, నతని దక్షిణహస్తమగు లక్ష్మణుని నావెంట బంపవలయు. ఆ రక్కసులు రామునకుదప్ప ఇతరులకజేయులు" అనివచించెను. కులగురువగు వసిష్ఠులును "రామలక్ష్మణులను బంపుటశ్రేయము" అనిచెప్పినమీదట దశరథుడు తనదుఃఖము నణచుకొని, రామలక్ష్మణులను ధనుర్బాణములతో బలిపించి,

పెద్దలగువారియెడ ప్రవర్తింపవలసిన విధులును, మాయావినుల గు రక్కసుల నణక్కడంచు మార్గములును ఉపదేశముచేసి విశ్వామిత్రునివెంట బంపించెను. ఆహా! ఈరామునిపై తండ్రికెంతటి ప్రేమయో చూడుడు! విశ్వామిత్రు నంతటిఘనుడు వేడినను కొడుకులను వారివెంట బంపుటకు సంకోచించెనుగదా! ఏటికి? ప్రేమ పెంపున. అంతప్రేమకలుగుటకు కారణమేమి? లేకలేక కలిగినపుత్రులు; అందునను, సకలశాస్త్రకళా నిపుణులు; పితృాజ్ఞాపరిపాలకులు; అన్నిటను తనకు సమానులైయుండు టవలననే యింతప్రేమకలిగెను.

(తాటకినిఁ చంపుట.)

ముందు విశ్వామిత్రఋషియు వెంట రామలక్ష్మణులును అరణ్యమార్గములబడిపోవుచు, పర్వతములను, నదులనుదాటి యొక ఘోరకాననమునకు వచ్చిచేరిరి. ఈయరణ్యములో తాటకియను రాక్షసస్త్రీ నివసించుచుండెను. ఈరక్కసి తొలుత యక్షిణియైయుండి శాపమూలమున రాక్షసస్త్రీ యయ్యెను. ఈమె జంభాసురుని కొడుకగు సుందయనువాని భార్య. ఈమెకు మారీచుడను పుత్రుడొక్కడుండెను. అతడును మహాపరాక్రమవంతుడు కాని బహుక్రూరుడు. తాటకియు మారీచుడును గోవులను, బ్రాహ్మణులను వధించుచు, యజ్ఞయాగాదికార్యములకు విఘ్నములు కలిగించుచుండును.

ఈరామలక్ష్మణ విశ్వామిత్రు లాయరణ్యములో బోవుచుండు నప్పటికీమె భయంకరకంఠధ్వని వీరికి వినవచ్చెను. వెంటనె విశ్వామిత్రఋషీశ్వరుడు రాముని జెంతబిలిచి యారక్కసిని జంపుట కాజ్ఞయొసగెను. కాని, రాముడు "ఈయమరాక్షసి యైనను స్త్రీకదా! స్త్రీలనుజంపుట క్షత్రియధర్మమునకు విరుద్ధముకాదే?" యనియనెను. అందుకు విశ్వామిత్రుడు "క్రూరకృత్యము లొనరించువారు స్త్రీలైనను వారిని శిక్షించుట క్షత్రియులకు ధర్మమే. వినుము; పూర్వము ఇంద్రుడు సర్వాసురాలగు మంథరను చంపెను. విష్ణువే భృగుమహర్షి పత్నిని, శుక్రచార్యులతల్లిని వధించెను. కావున దుష్టశిక్షణ మావశ్యకముగా కావలసినదె. తాటకినిజంపుటవలన గోబ్రాహ్మణులను రక్షించినవాడవే యగుదువుకాని స్త్రీహత్యాపాతకము నిన్నంటజాలదు. అట్లొకవేళ పాపమబ్బినను సాధుజనుల రక్షించిన పుణ్యమా పాపములను దుడిచివేయును. కావున ఈక్షణమె ఈరాక్షసినివధింపుము" అనియనెను. వెంటనె రాము డనుమానింపక బాణాసనమున విల్లెక్కుపెట్టి యొక్క వ్రేటున నారక్కసిని వధించెను. వెంటనె యారక్కసి కొండపడినట్లు క్రిందపడి భయంకరముగా అఱచి ప్రాణమువిడిచెను. ఈవిధముగా తాటకిని సంహరించి విశ్వామిత్ర లక్ష్మణులతో గలసి శ్రీరామచంద్రుడు సిద్ధాశ్రమమునకు బోవుచుండెను. అటవనములో ఒకపెద్దబండయుండెను. ఆబండను రాముడు

చూడలేదు. కావున దానిప్రక్కగ పోవుచుండినపుడు అతని పాదములాబండకు తగిలెను. వెంటనే యారాయి స్త్రీగా మారి, యాశ్రీరాముని యెదుటనిలిచి నమస్కరించెను. రాము డబ్బురపాటుతో "ఈరాయి నాపాదము సోకినంతనె స్త్రీగమారుటకు కారణమేమి? ఈమెవ్వరు? ఈయమ యీశిలాకారంబును బొందుటకుకారణమేమి? నాకువినిపింపవేడెదను." అనివినయముగా విశ్వామిత్ర మహర్షి నడిగెను. అప్పుడు విశ్వామిత్రుడు "బిడ్డా! ఈయమ గౌతమ మహర్షిభార్య. పేరు అహల్య. కొన్నికారణములచే ఈమెపై భర్తకుకోపముకలిగి 'నీవుశిలవైపోవుదువుగాక'! అనిశపించెను. అందుకు ఆమెతాను నిరపరాధినియనియు, తన్ను క్షమింపుమనియు బహుభంగుల బ్రార్థించియేడువ, మగనికి కోపముశాంతించి 'యిచ్చినశాపము మరలించుటకు శక్యము కాదు; కాని, నీవుకొంతకాలము శిలాకారముగానుండవలసినదె; పిదప శ్రీరాము డాశిలనుత్రొక్కును. అతనిపాదము తగిలినంతనె నీవు నీనిజస్వరూపమును ధరించగలవు. మఱియు, పవిత్రవుకాగలవు. అప్పుడు మరల నిన్నునే బిలిపించుకొనియెదను.' అని యాతడిచ్చినశాపము విమోచనమగు మార్గము వచించెను. కావున, ఇప్పుడు నీపాదము లీరాతికి తగిలినంతనె గౌతమునిభార్యయగు ఈమె తన శాపమునుండి విముక్తిని బొందినది." అనిచెప్పెను. అంతట ఆయహల్య శ్రీరాముని

స్తుతించి, యతనియాజ్ఞగైకొని తనభర్తతో గలసికొనెను.

అటనుండి వీరుమరల తమ ప్రయాణమును సాగించి, విశ్వామిత్రుని యాశ్రమమునకు వచ్చిచేరిరి. విశ్వామిత్రుడు యజ్ఞముచేయుటకు ప్రారంభించెను. రామలక్ష్మణులు ధనుర్బాణములను చేతధరించి కుటీరమ్ము ముందరిభాగమున కావలి కాచుచుండిరి. ఋషీశ్వరుడు యజ్ఞము ప్రారంభింపగానే యాయరణ్యమున నివసించుచుండిన తాటకిసుతుడగు మారీచుడును, అతని సహచరుడగు సుబాహుడును విశ్వామిత్రుని యజ్ఞమునకు విఘ్నము కలిగింపవలెననియెంచి, కుక్కమాంసము, సారాయము, గోమాంసము, గోరక్తము, మొదలుగాగల యసహ్యావస్తువులు తీసికొనివచ్చిరి. రామలక్ష్మణులు వారినడ్డగించిరి. ఈమనుష్యమాత్రులు, అందునను, బుడుతలు తమ్మునడ్డగించుటజూచి, మారీచసుబాహులకు మిక్కుటముగకోపముకలిగి, కన్నుల నగ్నికణములు గ్రక్కుచు, వీరిని మ్రింగివేయవలెనని రామునిపై దూకిరి. ఇంతలో రాముడు గురిచూచి తనబాణమునువదిలెను. రాక్షసులు దానిని తప్పించుకొనిరి. పిదప రాక్షసులకును రామలక్ష్మణులకును గొప్ప యుద్ధముజరిగెను. ఆయుద్ధములో మారీచుడు ఓడిపోయి, రామునిధాటికిని, రామలక్ష్మణుల బాణములకు నెదురునిలువ లేకపారిపోయెను. సుబాహునకు భయంకరమగు గాయము

తగిలెను. అంతట కొందఱు రక్కసులువచ్చి గాయముతగిలి నేలపైబడియున్న సుబాహునెత్తుకొనిపోయిరి. మరల యే రక్కసులును యాగము విఘ్నముచేయుటకురారైరి. వచ్చిన రామునిచేత తమకు చావుతప్పదనుకొనిరి. కావున, ఏవిఘ్నములును తటస్థముకాకున్నందున విశ్వామిత్రుని యజ్ఞము పూర్తిగా రక్షింపబడెను. ఈవిధముగా నైదుదినములు విశ్వామిత్రునియజ్ఞము పూర్తియైన పిదప అతడు రామలక్ష్మణులను మిక్కిలిపొగడి, మఱింత వాత్సల్యముతో జూచుచు వారికింకను అనేకబాణములనిచ్చి యాబాణములను బ్రయోగించువిధమును, మంత్రములును ఉపదేశించెను. ఈముగ్గురును సుఖముగా గాలముగడపుచుండ, ఒక్కనాడు విశ్వామిత్రుడు రామలక్ష్మణులగాంచి "బిడ్డలారా! ఇచటికి కొంతదూరముననె మిథిలయను పట్టణముకలదు. ఆపట్టణమును జనకుడను రాజు పాలించుచున్నాడు. అతనికొక సుందరియగు కన్నియకలదు. ఆమె రూపమునను, గుణములయందును విద్యాబుద్ధులయందును అసమానురాలు. ఆమెకిప్పుడు వివాహము కావలసినవయస్సు వచ్చినది. తండ్రి స్వయంవరమును సాగించియున్నాడు. నన్ను గూడగావలసినదని పిలిచియున్నారు. నేను పోవలసియున్నది. కావున మీరును నావెంట రండు. అచట ఒక శివధనుస్సు కలదు. అదిచాలపెద్దది. దానినెత్తుటకు ఎవరిచేతనుకాదు. అట్టి మహాధనుస్సును మీరునుచూడవలసినదె. పయనముకండు."

అని ప్రేమపూర్వకముగా అనెను. రామలక్ష్మణులును "చిత్తము ; తమయాజ్ఞను శిరసావహింతుము." అని విశ్వామిత్రుని వెంటనె మిథిలరాజధానికి ప్రయాణమైపోయిరి.

( సీతా స్వయంవరము. )

జనకమహారాజు పాలించుచుండిన మిథిలానగరము మహా శృంగారముగా అలంకరింపబడియుండెను. దేశదేశముల నుండియు బిలువబంపబడిన అనేక మహారాజులును, రాజులును, సామంతరాజులును, జమీందారులును, మంత్రులును, సేనానాయకులును, బ్రాహ్మణులును, గుంపులు గుంపులుగా వచ్చి రాచనగరున విడిసిరి. అనేకులువచ్చుచుండిరి. వీధిలో ఏవైపునజూచినను గుఱ్ఱపుబండ్లును, ఏనుగులును, భటులును నిండియుండిరి. నగరున మంగళవాద్యములు మ్రోగుచుండెను. ఎక్కడచూచినను ఆనందము తాండవమాడుచుండెను. అట్టియానందసమయమున ఒకవృద్ధుడు ఇరువురు బాలురతోవచ్చి నగరులోనకు బోనకయె ద్వారపాలకులయొద్ద కరిగి యాముసలి యొకకావలివానితో నేమియో చెప్పెను. వాడామదుకనికి సాష్టాంగ ప్రణామముచేసి, లోనకుబోయి జనకునితో చెప్పెను. అంతటనె జనకమహారాజు తన కులగురువగు శతానందునితో ద్వారముచెంతకువచ్చి యావచ్చినవృద్ధునిగని నమస్కరించి, కుశలమడిగి "దేవా! దేవరవారి రాకవలన

నేనుకృతార్థుడనైతిని. నాముద్దుల తనయయు చరితార్థయయ్యెను. లోనికివిచ్చేయుడు!'' అనియాబాలురతో నావృద్ధుని లోనకు దీసికొనిపోయి యొక తగినస్థలమున గూర్చుండబెట్టి ''దేవా! బాలసూర్యునివలె ప్రకాశమానులైయున్న యిబ్బాలకులెవ్వరు? చూడ వీరిరువురు నన్నతమ్ములని తోచెడి. వీరలెవ్వరో తెలిపి నన్నానందపఱతురని వేడుచున్నాను!'' అనివినయముతో బ్రార్థించెను. అంతనావిశ్వామిత్రుడు (ఈ వచ్చినముదుకకు విశ్వామిత్రుడె) జనకునితో ''రాజా! ఎఱుగుదువుకదా అయోధ్యాపురంబును, ఆపురమునేలు దశరథమహారాజును! ఈబాలకులిద్దరు నాతని కుమారులు. ఇందీతడు రాముడు; ఇతడు లక్ష్మణుడు. నాయజ్ఞమునకు విఘ్నములు గల్పించుచుండిన రాక్షసుల నివారణార్థమై యీబాలకులను నేను నాయాశ్రమమునకు బిలిచికొనివచ్చితిని. వీరును దమ శౌర్యమునుగనపరచి, తాటకియను భీకరాకారియగు రాక్షసిని జంపి నాయజ్ఞమునుగాపాడిరి. ఇంతలో నీయింట స్వయంవరము జరుగగలదని విని యీమహాదేవుని ధనువును ఈబాలకులకు జూపుదమని పిలుచుకొనివచ్చితిని'' అని కొన్నిమాటలలోనె జరిగినసంగతినంతయు జెప్పివేసెను. ఆమాటలకు జనకుడత్యసంతోషముతో నారామలక్ష్మణులను గౌగిలించి, కుశలమడిగి సన్మానించెను. వచ్చినభూపతులెల్లరును ఒక్కసభాభవనమున గుమిగూడి కూర్చుండియుండిరి. బ్రాహ్మణులెల్ల

రును మఱొక్కవైపున గూర్చుండియుండిరి. నడుమ నొక యెత్తై
న ప్రదేశమున జనకమహారాజును, అతని కుమారితయు, కుల
గురువును నిలచియుండిరి. సభామధ్యభాగమున ఒకమనోన్న
తమైన ఇనుపపెట్టెయుండెను. ఆపెట్టెలోనె శివుడిచ్చిన ధన
స్సుకలదు. అప్పుడు జనకమహారాజు సభాసదులవంకదిరిగి
“భూపతులారా! మిత్రులారా! ఇదియె నాప్రక్క నిలిచి
యున్నయీమె నాకుమారిత. ఈమె నాకు యజ్ఞభూమిలో
దొరికినది. ఈమెకు తల్లి భూదేవి. నేనీమెను పెంచుకొనుచు
న్నాను గావున నేనీమెకు తండ్రిని. ఈయమ యిప్పుడు ఉపవర
(వివాహయోగ్య) యైయున్నది కావున, ఇదుగో మీయెదుట
నున్న పెట్టెయలో ఒకధనస్సుకలదు; ఆధనస్సును ఏశూరుడు
వంచునో యాతనికి సీతనిచ్చి వివాహముచేయువాడను కావు
న, మీలోనెవ్వరైనను సరే, అటు చేయగలుగుదురేని చేయు
డు” అనియనెను. అంతనె యట రాజకుమారులలో ఒక్కొ
క్కొరుగవచ్చి, యాధనుస్సు నెత్తలేకయెపోయిరి. కొందఱు
ధనుస్సునెత్తియు వంచుటకు శక్తిచాలక వెనుకకుపడిపోయిరి.
మహాబలవంతులని ప్రసిద్ధికెక్కిన వారుకూడ ఈధనుస్సు నెత్త
లేకపోయిరిప్పుడు ఇంకవంచుటెట్లు? అందునను లోకమందం
తనను శూరులలో శ్రేష్ఠుడని యనిపించుకొనిన లంకాధీశుడ
గు, రావణుడును ఆధనుస్సు ముందఱకువచ్చి దానిని లేవనెత్తి
వంచునప్పటికి అతడు వెనుకకె నిశ్చేష్టుడై పడిపోయినప్పుడు

ఇంక సాధారణ రాజపుత్రులమాట చెప్పనేల? తక్కినజనులు ఆ ధనుస్సున్న చోటికైనను పోవకుండిరి. అందుకు కారణ మడు గగా "సీత నాకువరుసకాదు. ఈమె నాకు చెల్లెలుసుమా" యనియొక్కడును; "నేను జానకమ్మను పెండ్లియాడవలెనని రాలేదు. ఇచట ఈవిల్లునువంచు శూరుడెవ్వడో, సీతమ్మ ప్రాప్తమెట్లున్నదో, అని ఈ వేడుకనంతయు చూచుటకువచ్చితి ని" అని యింకొక్కడును; "నే నీమధ్యనె చాలజబ్బుపడినాను; బ్రతుకుదు ననుకోనలేదు; ఎట్లాగో బ్రతికినాను. ఇప్పుడు దీని నెత్తుటకు బలమెక్కడిది? ఈ వేడుకలు చూడవచ్చితినేగాని, ఇంకేమియుకాదు" అని మఱొక్కడును; ఈవిధముగా కొందఱు విల్లునుగూడనైన చూడకపోయిరి. అప్పుడు జనకమహా రాజు మిక్కిలి చింతించెను. "ఇందఱు రాజపుత్రులలో ఒక్క డైనను ఈ ధనుస్సు నెత్తలేకపోయెనే! మాజానకికి ఇంక తగిన భర్తయెక్కడలభింపగలడు? ఏమిచేయుదము" అని విచారించి విశ్వామిత్రుని వంకదిరిగి "మహాత్మా! ఈ రామలక్ష్మణులు ధను ర్విద్యయందు కుశలులని తమరుసెలవిచ్చితిరి. కావున, ఒక్క సారా రాముని ఈధనుస్సునెత్తుట కనుజ్ఞనిండు. అతడైన దీని వంచునేమో చూతము" అని విన్నవించెను. అందునకు విశ్వామిత్రుడు నవ్వి "రాజా! శూరశ్రేష్ఠులగు ఈ వీరులవల ననేకాని యీ కష్టకార్యము ఈ నిశువులచేతనగునా? వీరశిఖా మణియగు లంకేశుడే ధనుస్సునెత్తలేక, క్రిందపడి యూపిరి

త్రిప్పుకొనలేకుండెగదా! ఇంక ఈబాలుడేమిచేయగలడు! అయి నను, ప్రయత్నించిననష్టమేమి? విల్లునువంచెనా, సీతనుబొంద గలడు; వంపలేకపోయెనా, యందు పరాభవమేమి? ఇందఱు శూరులయెదుట నీ పసిబాలుడెంత? అని రామునిజూచి "రామచంద్రా! నీవీ ధనుస్సునెత్తి వంపగలవేమో ప్రయత్నించిచూడుము" అని యనుజ్ఞనిచ్చెను. అంతనే శ్రీరాముడు చిరునగవుతో ధనువున్నచోటికరిగి, మనము సాధారణము గా నాటకములలోను ఆటలలోను ఉపయోగించు ధనుర్బాణ ములను ఎంతసులభముగా ఎత్తుట చూచుచున్నామో యా విధముగానె యెంతమాత్రము ప్రయాసపడక ఆధనుస్సునెత్తి ఒక్కకొనను తనకాలి బొటనవ్రేలిక్రింద నదిమిపట్టి, రెండవ కొనను ఎడమచేతవంచి త్రాటిని కుడిచేతితో కట్టబోయెను. అంతనే యాధనుస్సు చాలవంగినందున మధ్యభాగమునవిఱిగి పోయెను. సభవారందఱు అతనిశౌర్యమునకు మెచ్చి కరతాళ ధ్వనులతోను "శేష్-శభాష్-వహ్వా" అను ధ్వనులతోను అతనిని సన్మానించిరి. ఇంతలో సీతచేతికొక పుష్పహారము దాసియందియ్యగా, దానినామె చేతధరించి, మందగమనము తో మెట్లుదిగి రామునికంఠమున ఆ హారమునువేసి, యాతని యెడమవైపున నిలిచెను. ఋషీశ్వరులును, బ్రాహ్మణులును తక్కినపెద్దవారును ఈ దంపతులను ఆశీర్వదించిరి. ముత్తైదు వులు హారతులెత్తిరి. మంగళవాద్యములు మహాఆనందముతో



సీతా స్వయంవరము.

మ్రోయదొడగెను. "అయోధ్యాదేశపు రాజగు దశరధుని కుమారుడట, అతని పేరు రామచంద్రుడట, అతడు మనసీతమ్మకు మగడైనాడు" అని పురజనులందఱును ఒక్కరితో నొక్కరు చెప్పుకొనదొడగిరి. పిదప ఈ శుభవార్తను దశరధునకు తెలుపవలెననియు, శుభముహూర్తమున వీరికి పెండ్లిచేయువలెననియు, అందుకు సమ్మతించి బంధుజన పరివార సమేతుడై ముహూర్తమునకు రావలసినదనియు జనకమహారాజు దశరధునకు శుభలేకవ్రాసెను.

ఈ శుభలేఖ అయోధ్యలో దశరధునకందినది. అతడు దానిని చదువుకొనెను. ఆహా! ఆతనికైన యానందము నేమని చెప్పనచ్చును? మేము చెప్పలేము. ఆయానందమును అనుభవించినవారికే గాని యితరులకు తెలియదు. కావున ఇంతే చెప్పెదము. దశరధుడును ఆతని రాణులును, ఇతరజనులును మిక్కిలి సంతోసించిరి. వెంటనె దశరథమహారాజు పెండ్లికి కావలసిన సన్నాహాములతోడను, పరివారముతోడను బయలుదేరి మిథిలానగరమునకు వచ్చిచేరెను. జనకమహారాజు వచ్చిన వియ్యంకులను ఇతరజనులను తగినరీతిని ఉపచారములు చేసి, సన్మానించి, సీతను రామచంద్రునకిచ్చి నిశ్చయించిన శుభముహూర్తమున మహావైభవముతో పెండ్లిచేసెను. జనకమహారాజునకు ఊర్మిళయను మఱొక్క కూతురుండెను. ఈ శుభముహూర్తముననె ఊర్మిళను లక్ష్మణునకును జనకుని

తమ్ముడగు కుశధ్వజుని కుమారితలగు మాండవిని, శ్రుతకీర్తిని వరుసగ భరతునకు, శత్రుఘ్నునకును ఇచ్చి గొప్ప వేడుకతో పెండ్లిచేసిరి. ఈ సమయమున బ్రాహ్మణులకు లెక్కలేనంత ధనము దానమిచ్చిరి. ఇరువైపులవారును గొప్పవారు. మహారాజులు. ఇంక వేడుకల కేమితక్కువ? దానధర్మముల కేమి కొదవ? అందఱును ఈ దంపతులను దీవించి తమతమ దేశములకు జనిరి.

పెండ్లి పదియారుదినములు గడిచినపిదప దశరథమహారాజు తనకుమారులతోడను, కోడండ్రతోడను, జనకమహారాజు సెలవుతీసుకొని తనరాజధానికి పోవబయలుదేరెను. ఇంతలో మార్గములో జమదగ్ని కుమారుడగు పరశురాముడు వీరికెదురుగవచ్చి మహాకోపముతో "రామా! నీవు శివధనుస్సును వంచినశూరుడవని లోకమంతయు వాకొనుచున్నది. ఆప్రాత ధనుస్సువంచుటయా శౌర్యము? ఇదుగో నేను ఇరువదియొక్క మారులు క్షత్రియులను నాశముచేసి విష్ణువుచే ఒసగబడిన ధనుస్సును ధరించియున్నాను. ఇదుగో! ఈధనుస్సును నీవు వంపగల్గితివా, అప్పుడునిన్ను నిశ్చయముగు శూరుడవందును; నిశ్చయమైన క్షత్రియుడవందును" అని తనధనుస్సును క్రిందవైచెను. ఈతని పరిహాసపు పలుకులయెడ రాముడలుగకుండ మెల్లగ ఆబాణమువైపునకుబోయి దానిని ఒక చిన్నపుల్లను ఎత్తినచందమున అవలీలగానెత్తి, కనుమూసితెరుచునంతలో

దానిని వంచెను. పరశురాముడు మహాసంభ్రమభరితుడై రాము
ని శౌర్యమునకు మెచ్చుచు, అనేకవిధముల బొగడుచు, వెడలి
పోయెను. అటుపిమ్మట వీరందఱును అయోధ్యాపురమును జేరిరి.
అచ్చటి ప్రజలెల్లరును తమరాజకుమారులు పెండ్లియాడివచ్చి
నందున దమకుదోచిన కానుకలు వారికర్పించి, సంతసించి,
తమకు రాజుగారియెడనున్న భక్తివిశ్వాసములను బ్రకటించిరి.
అందఱును సుఖముగానుండిరి. కొన్నాళ్లకు భరతుడు తన
తాతగారింటికి నందిగ్రామమునకు వెళ్లవలసివచ్చి తాను బయ
లుదేరెను. ఆతడెక్కడికిపోయినను వెంటనేయుండు అలవాటు
చొప్పున శత్రుఘ్నుడును భరతునివెంటబోయెను.

# 2. అయోధ్యా కాండము.

(ఈ కాండములో శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు
పెండ్లియైనతరువాత అయోధ్యలో జరిగినచరిత్రమును వివరిం
చియున్నందున ఈ కాండమునకు "అయోధ్యాకాండము"
అని పేరుపెట్టబడినది.)

శ్రీరాముడు తనపరాక్రమము మూలమునను, మంచిస్వభా
వముపలనను అందఱికిని మిక్కిలి కావలసినవాడయ్యెను. అం

దలును అతనిని మెచ్చుకొనుచుండిరి. అతడు అందఱితోడను ఎల్లప్పుడు నింపుగామాటలాడును. ఎన్నడు నెవ్వరితోడను గట్టిగామాటలాడి వారల మనస్సును నొప్పింపడు; అందఱి యెడలను వినయముతో ప్రవర్తించును. అతనికి ఆవంతయైనను గర్వమనుమాటయే లేదు; అతడెల్లప్పుడు నందఱిని సంతుష్టపఱచును; దానతాను సంతుష్టుడగును; విద్యయందును మనసుంచి యభ్యాసముచేయును; దేహము సదా ఆరోగ్యముగా ఉంచవలెనని క్రమముగ వ్యాయామము చేయుచుండును. ఎప్పు డెవ్వరితో, నేవిధముగా, మాటలాడవలెనో ఏరీతిగప్రవర్తింపవలెనో యతనికి చక్కగ తెలియును. ఈ కారణములవలనను, ఇతరసద్గుణముల మూలమునను రాముడందఱిచేతను పొగడబడుచుండెను. అందఱి ప్రీతికిని పాత్రుడయ్యెను. అందఱు నితని మిక్కిలి గౌరవించుచుండిరి. అట్లుండగా ప్రజలెల్లరు నితనిని యువరాజునుగా జేసికొనవలెనని యూత్రపడుచుండుటయం దాశ్చర్యమేమి? ఇతడే తమకధిపతిగా నుండవలెనని కోరుచుండిరి. అందునను అతడే జ్యేష్ఠకుమారుడై యున్నందున యువరాజపదవి ధరింపనుండెను. (యువరాజనగా తండ్రికి యనంతరము రాజ్యమేలుటకు దగినవాడు అని యర్థము.) అందువలన నెల్లవారును ఇతనికెప్పుడు యువరాజ్యాభిషేకము చేయుదురో, ఆ యుత్సవమెప్పుడు కన్నులారజూచి యానందింతుమో యని యాతురపడుచుండిరి. దశరథుడు తనకన్నుల

మొదటనే శ్రీరామునకు రాజ్యాధిపతిగా చేసి, రాజ్యభారమును అతనిపై మోపి తాను నిశ్చింతగా కాలముగడపవలెనని తలచుచుండెను. తన యీ యభిప్రాయము మంత్రులకును కొందఱు ఉద్యోగీయులకును దెలిపెను. అందఱును మిక్కిలిగ ఆనందించిరి. రాముని రాజ్యాభిషేకమునకు శుభముహూర్తము నిర్ణయింపబడెను. అందునకు అన్నిప్రయత్నములును జరుగుచుండెను.

(దశరథుడు రామునకు ఉపదేశము చేయుట.)

అన్నియును సిద్ధమైనపిమ్మట ఒకనాడు దశరథుడు రాముని తనసన్నిధికి బిలిపించి కూర్చుండబెట్టి "కుమారా! రామా! నా పుత్రులలో అందఱికన్నను నీవు పెద్దవాడవు. నీ సద్వర్తనములవలన నీవందఱికిని ప్రీతిపాత్రుడవై యున్నావు. నాకు ముసలితనమువచ్చినది. కావున ఈ పుష్యమీ నక్షత్రమున నీకు రాజ్యాభిషేకము చేయనున్నాను. నీపై రాజ్యభారమును మోపి నేను అరణ్యమునకుబోయి తపస్సుచేసి ముక్తివడయ నెంచియున్నాను. నీవు విద్యావంతుడవును, గుణవంతుడవును నైయున్నావు. నీకన్నియును దెలియును. అయినను ప్రేమపొంగునను, పుత్రవాత్సల్యమునను నీకు కొన్ని యుపదేశవాక్యములు చెప్పబోవుచున్నాను. వానిని నీధ్యానమున నుంచి ప్రవర్తింపుము.

రాజ్యమునకు సంబంధించిన కార్యములన్నిటిని స్వయముగా జరిపించుచు, ప్రజల నిజస్థితిని చక్కగ విమర్శించి కను

గాని, దానిమీద న్యాయమెట్టులో యట్టుల జరిపించుట రాజు నకు ధర్మము. అనేకతెరున సైన్యములను జక్కబెట్టుచు, దుష్టు లను శిక్షించుచు, సర్వము చక్కగనుంచుటయు రాజధర్మము లై. నిష్కారణముగా నెన్నడును బయలను పీడింపదగను. శర ణన్నవారిని తప్పక రక్షింపవలయును. రాజ్యమునగల యితర అధికారులు తమదమ పనులను చక్కగ. న్యాయముగ, జరు పు చున్నారో లేదో కనుగొనుచు, వారిని న్యాయమార్గాను గాముల జేయుటకు తగిన ప్రోత్సాహముచేయవలెను. దుఃఖము లనువారిని సమాధానపఱచి వారికి సంతోషముకలిగింపవలె ను; తన్ను దాను పొగడుకొనుటయు, పరులను నిష్కారణముగ నిందించుటయు ఎన్నడుదగదు. పరుల సొమ్ములపై ఎన్నడును ఆశపడకూడదు. లోభము (ఆశ) అనునది అనర్థములకు మూలకారణము. సకల జీవజంతువులపైనను దయయుంచవల యు. సజ్జనులను ఆదరింపవలెను. ఇన్నిమాటలేల? వినుము: ప్రజలను బిడ్డలవలె పాలింపవలయు; మఱియును వారికెంతసు సౌఖ్యముకలుగునో యందువనె రాజునకు సౌఖ్యముకలుగును. మఱియు, వారికిదుఃఖముకలిగెగా, యందే రాజునకు దుఃఖము తప్పక కలుగుచున్నది, అని యెఱిగి తానుచేయవలసిన పను లను తప్పకచేయవలెను. ఎల్లప్పుడును ప్ర జ ల సౌఖ్యమునే కోరుచుండవలెను. ఈవిధముగా జరుపుచుండిన నీకు పుణ్య ముకలదు- ఇంతయునే నిశ్శ్రేయస్కమైన పురుషార్థముకలదు; అని

యుపదేశము చేసెను. తండ్రి చెప్పిన ఉపదేశములను శ్రద్ధతో విని "రాముడు చిత్తము; మీయాజ్ఞను శిరసా వహించి ప్రవర్తింతును" అని వచనమిచ్చి, తండ్రికి నమస్కరించి వెడలిపోయి ఈ సకల వృత్తాంతమును దన తల్లికెఱింగించి యామె దీవెనలబొంది, యటనుండి తన మారుతల్లులగు కైకయీ, సుమిత్రాదుల కడకేగి, వారికి నీ వృత్తాంతమెల్ల తెలియబలికి, వారు ఆశీర్వదింప, అటనుండి కదలి తన మందిరమునకు పోయిచేరెను.

(రాజ్యాభిషేకమునకు ఆటంకము.)

ఉదయమున అయోధ్యా నగరమంతయు శృంగారింపబడెను. పురమున నెందుచూచినను మంగళవాద్యములు మ్రోగుచుండెను. బాలురు స్త్రీలు పురుషులు రామునకు నేడు "రాజ్యాభిషేకము కానున్నది. మన మందఱమును చూడ బోవలెను. మకుట ధారణమునకుముందు ఊరేగును, చూడవలెను" అని వేడుకతో శృంగారించుకొని, తమతమ మిద్దెలమీదను మేడలమీదను, అరుగులమీదను, చెట్లమీదను, గుంపులు గుంపులుగాగూడియు, ఇండ్లకిటికీలు తెఱచియుంచియు చూచుచుండిరి. పురజనులేగాక, యితర దూరదేశములనుండియు రాముని దర్శించుటకును, పట్టాభిషేక మహోత్సవమును కన్నులార దిలకించి సంతోషించుటకును,

అనేకులువచ్చిరి. అందఱును శ్రీరామ దర్శనమునకు ఆతురపడుచుండిరి. ఇట్టి సంతోష సమయమున అయోధ్యానగరము ఏవిధముగా ఉండవలెనో మీరు యోచించి చెప్పగలరా? నేల యీనిన ఈ జనులందఱుపుట్టినో అనునట్లుండెను.

దశరథుని రెండవభార్యయగు కైకేయికి మిక్కిలి పరిచయురాలును, అంతర్యనెచ్చెలియునునగు దాసి యొకతె యుండెను. ఆమెపేరు మంథర. ఈ రామ పట్టాభిషేకవార్త యామెకుదెలిసెను. అంతనె ఆమెకు మిక్కిలి సంతాపముద్భవమయ్యెను. తనదుఃఖమును పట్టలేక, ఈర్ష్య నాపుకొనలేక, నిదురించుచున్న తన యజమానురాలగు కైకేయి చెంతకేగి "అమ్మా! కైకేయీ! లే లెమ్ము; అయ్యో! నీవిట్లు నిదురపోవుచున్నావేల? అయ్యో! ఎంతమోసమయ్యెను' అమ్మా! నీకెట్టి దుష్కాలము సంప్రాప్తమైనదమ్మా! ఇంక నీజీవితము వ్యర్థమయ్యెగదమ్మా! అయ్యో! ఇంకను నిద్రించుచున్నావే! నీవింక ఎన్నడు మేల్కొందువో! అక్కటా! నేనేమిచేయుదును! ఎట్లోర్తును? నీకెంతమాత్రము విచారములేదుకదమ్మా! అయ్యో! నీ భర్తగారు నీయెడల నెంతకపటముగా మెలగుచుండెనమ్మా! పిచ్చిదాననై యూతనినమ్మి మోసపోతివికదమ్మా! 'నాభర్త నామాట జవదాట' డంటివికదమ్మా' అయ్యో! ఆతడెంత చేసెనమ్మా! నీకుమారునకు రాజ్యమీ

యకూడ దనుతలంపున అతనిని తాతగారింటికి పంపివేసె గదమ్మా! కౌసల్యాతనయుడే రేపు సింహాసనమెక్కి రాజ్యమును పాలించుచుండ నీవును నీతనయుడును, వారికిదాసులై, అసగునకు మడుగులొత్తుచు, వారియాజ్ఞలమెలగుచు సదా సర్వదా వారికి యుపచారములుచేయుచు, వారు పెట్టిన యన్నమునుతిని వారిచ్చిన బట్టలుకట్టుకొని, జీవయాత్రగడప వలయుగదా! అతనికేగాక, రాజమాతయగు నీ సవతికికూడ నీవును, నీ తనయుడును ఊడిగములు చేయుచుండవలెగదమ్మా! అమ్మా; నాకడుపు దహించుకొని పోవుచున్నదికదా! నీకా వంతయు విచారములేదుగదమ్మా'' అని యనేకవిధములుగ ఏడ్చుచుండ, కైకెయీ మేల్కొని, యామంధర పలుకు లన్నియు శాంతభావముతోవిని ''ఓసీమంథరా; నేడు నీకేమయ్యెనే? ఏటికీవిధముగా విలపించుచున్నావు? జరిగిన వృత్తాంతమైనచెప్పక యీవిధముగ ఏడువనేల?'' అని యడిగెను. అందుకా మంధర ''అమ్మా! నీ కేమని చెప్పుదు! నేటిదినమున రామచంద్రునకు పట్టాభిషేకముచేయుదురట. పౌరులెల్లరును మహా ఆనందముతో నున్నారు. పురమెల్ల మహా శృంగారముగా నలంకరించుచున్నారు. ఎక్కడ చూచినను ఉత్సవమువె- ఇందువలననే- నీ తనయుడు యిలోనుండిన అతనికి పట్టముకట్టవలసి వచ్చునేమోయని భయపడి నీ భర్త- ఆకపటాచరణుడు- అతనిని తాతగారింటికి పంపివేసెను. నీకు

కష్టకాలము సంప్రాప్తము కానున్నది. నీవు దాసీజనులమగు మాతోబాటుగ రాజునకును, రాజమాతయగు కౌసల్యకును ఊడిగములు చేయవలసివచ్చెనే! అమ్మా! అమ్మా!" యని మఱింత బిగ్గరగా రోదింపదొడగెను. అప్పుడు కైకేయీ యానందముతో "మంథరా; మా రామునకు రాజ్యాభిషేకము చేయుచున్నారనువార్త నీనోట వినగలిగితిని! ఈ శుభవార్త తెచ్చిన నీకిదే ఈ ముత్యాలహారమును బహుమానముగా నిచ్చుచున్నాను, ధరింపుము" అని తన మెడనున్న ముత్యముల హారమునెత్తి మంథర కంఠమున వేయబోయెను. అంతనా మంథర మహాకోపముతో "అమ్మా! రేపటినుండియు నీ ముత్యాలహారము ధరించు ప్రాప్తము నీకే లేకపోవును. ఇంక నాకేల? అయ్యో! రాముడు రాజైనపిమ్మట నీగతి యేమి కానున్నదో- నీకుమారునిగతి యేమికానున్నదో- అయ్యో! నీవేల యోచింపలేదు? మహారాణియని పేరుబొందిననీవు రేపు నీసవతులయెదుట మాతోబాటు దాసీతనమునొప్పి, నీ సవతియగు కౌసల్యకు ఉపచారము చేయవలసి వచ్చుగదా; ఆమెకు నీపైనను నీకుమారునిపైనను నున్న కోపము ఆరీతిగానైనగదా ఆమె తీర్చుకొనును-" అని యేడ్చుచుండెను. అప్పుడు కైకయీ "మంథరా; నీవెంత పిచ్చిదానవే; నీకడుపులోనున్న ఈర్ష్య నిన్ను కాల్చివేయు చున్నదేగాని, నీకీ భయమేల? నాకు భరతుడెట్టివాడో రాముడు నంతటివాడేసుమా!

కాని- అంతకన్నను కొంచె మెక్కువయె. ఏలయన మహా రాజుగారి తాత ముత్తాతలనుండి జ్యేష్ఠ కుమారునకు రాజ్యాభిషేకము చేయుట కనిష్ఠ కుమారునకు చేయుట యెక్కడి ధర్మము? అట్లు రాముడేమి తక్కువ? విద్యయందా- అతనికిసాటి యెవరు? శూరమునను- యతనికిజతయెవరు? సుగుణ సంపదను లోకమే చెప్పుచున్నది. ఇంక నాకు సవతి కుమారుడని యందువా- నన్నొక్క నాడైన పరుష భాష లాడి నాకు మనసు నొప్పించిగాని యెఱుగడు. ప్రతి దినమును ఉదయమున లేవగానే తినతల్లికి మొక్కట మొక్కి, వెంటనె నా చెంతకు వచ్చి నాకు మొక్కి నాదీవెనలనంది, పిమ్మట పనులు నెరవేర్చుకొనబోవును. నన్ను దవతల్లినిగ భావించి మాతృపూజ చేయుచున్నాడు. ప్రజల కందఱికిని ప్రియుడు. భర్తగారికి ప్రాణము- మాకందఱికిని జన్మము నుద్ధరించువాడు- భూదేవికి తగునాయకుడు- అట్టివాడు చే పట్టినగదా భూదేవిసౌఖ్యపడును? ఆమె సంతుష్టమగు నన మండలము సుఖాంతము? కావు, శ్రీరాముడె రాజు కావల యు. నీవింక నీఈర్ష్యయు, అసూయయు, స్వాభిమానమును వదలివేయుము" అని బోధించెను. అందున కామంథర కైకేయీ! నీయాపద నీవెఱుగకున్నావు. నీకష్టములు నీవు తలచలేదు; నీసుఖము నీవు కోరలేదు. రాజుగారు నీపై నెంతో ప్రేమయుంచినున్నారనియు, రాముడు నీయెడ మాతృ

ప్రీతి జూపుచుండుటనియు సంతసించుచున్నావు. ఇప్పుడట్లే యుండును. రేపురాజైనప్పుడు నీకెన్ని పాటులున్నవో- ఎన్ని కష్టములున్నవో నీవు ఊహించుకొనలేవుకదా! అమ్మా! నీకేలేని యీ విచారము నాకేల! నేను కైకయీదేవి గారికి దాసినేగాని, కౌసల్యాదేవి దాసికి దాసినై యుండజాలను. సీతకును రామునకును ఉపచారములు చేయలేను. నీవును నీ కొడుకును రామ చక్రవర్తికిని, సీతా చక్రవర్తినికిని, కౌసల్యా మహాదేవికిని ఉపచారములు, ఊడిగములు చేయుచు వారి పాదములు పట్టుచు "చిత్తము, దేవా!' 'ఆజ్ఞ' యని పలుదెఱంగుల వంగి వంగి నమస్కారములు చేయుచు వారి డిన యన్నముదిని దీర్ఘ కాలము బ్రతుకుడు. నేను పోయెదను. నామాట లిప్పుడు నీకు రుచింపవు. చేదుగానె యుండును. కాని, మునుముందు తెలియగలదు. అప్పుడు "నాచెలిక త్తెయు నా హితముగోరి యొసగిన యుపదేశము విననైతిగదా" ని చింతింపగలవు. మఱియొకసారి చెప్పుచున్నాను- నీవు విన్నను వినకున్నను మేలే. రామునిచేత రాజ్యము లభించెనా, నీ కుమారుని నతడు రాజ్యమున నుండనీయక వెడలగొట్టును. లేదా, అతని జంపనైన జంపును. రామచంద్రునకు లక్ష్మణుని పై ననురాగము మిక్కుటము. కావున లక్ష్మణున కేమియు భయములేదు. భరత శత్రుఘ్నులకు మాత్రము అపాయము రాక మానదు. కావున ఏ యుపాయము చేతనైనను భరతు

నకు ఈ రాజ్య పట్టాభిషేకము చేయించితిమా నీవు రాజమాత వగుదువు. సకలజనులును, నిన్ను జూచినంతటనె ఏవగించు కౌసల్య సహితము నీ యడుగులకు మడుగులొత్తుచు నీకుపచారము సలుపుదురు. నీ కుమారుని వంశమువారికి రాజ్యమునేలు ప్రాప్తము ఘటింప జేయవలెనన్న, రాముని బట్టాభిషిక్తుని జేయ నీయకుండవలయు. తరువాత నీ యిష్టము. నీ దాసినై, నీ హితము గోరుదాన గావున, నేనింత చెప్పితిని. అని హితము నుపదేశించెను. అప్పుడు కైక చక్కగ ఆలోచింప తన మనసునగూడ ఇట్టి యాలోచనలె తోచెను. మంథరపలుకులన్నియు నిక్కువములని తోచెను. ఆమెమనసున ఎన్నియో యనుమానములు పుట్టెను. అవి భయంకరములై యుండెను, సహింప దరముకానివై యుండెను. మనసున ఈర్ష్య పుట్టెను. రామునిపై నసూయ పొడమెను. ఎట్లయినను ఈ పట్టాభిషేక మహోత్సవము నాపవలెనని యామె యాత్మ యామెను బ్రోత్సాహ పఱచుచుండెను. ఆమెకు ధైర్యము కలిగెను. అప్పుడు "ఏయుక్తిచే మనమీ యుత్సవము నాపగలము" అని కైకయి మంథరనడిగెను. ఆమె తనత్రోవకు వచ్చుచున్నదని మంథర సంతోషముతో "అమ్మా! ఇప్పుడుకదా నీవు నిశ్చయముగ బుద్ధిమంతురాలవు. నేనింత చెప్పుచున్న, నీ కన్ను లిప్పుడే తెఱవబడిన్న వయ్యో. ఎంత మోసమున్నా యుండును! నిశ్చయముగా నీవు

ధన్యురాలవును నీకొడుకింక రాజ్యమేలుచున్నా డనుకొనుము-నీవు రాజమాత వైతి వనుకొనుము- సంతసించుము-" అను చుండెను. ఇంతలో నా మెమాటలు స్ఫూర్తికొనియన కైకెయీ "కాని మాసంతోషము తరువాత ననుభవింతు ముగాని తొలుదొల్త ఈ యుత్సవమునకు విఘ్నము కలుగ జేయుట కేదేని యుపాయము నెదకుము" అని యనెను.

మంథర— అమ్మా! ఉపాయమే లేదా?

కైకెయీ— ఏ ముపాయమున్న దే?

మంథర— ఇంతలోనె ఇాతమఱచుతా? అలనా దేవా సుర యుద్ధమున నీవు నీ నాథునకు సహాయము చేసినందుకు కాతడు మెచ్చి రెండు వరములిచ్చెద నడుగుమని యుండె లేదా?

కైకెయీ— అవును. ఆ వరము లిప్పుడడుగుచున్నా ఏమని యడుగుదు?

మంథర— వినుము. మొదటివరము- భరతునకు పట్టాభిషేకము చేయుట——

కైకెయీ— రెండవది?

మంథర— రాముని పదునాల్గేండ్లరణ్యముల నుండు బంపుట.

చేయుట సుకరముకాదు. అందువలననె రాముని నడవులకు పంపుమంటిని.

కైక. అవును- నీవు చెప్పినది బాగుగానె యున్నది. అని కోపము వచ్చినదియుబోలె బోయి మునుగుపెట్టుకొని పరుండి చింతలో మునిగియుండెను.

బాలకులారా! చూచితిరా కైకేయి మనసెంతలో మారెనో! ఎంతమంచివారికైనను ఇట్టి చెడుఉపదేశములిచ్చిన వారిమనసు చెడుమార్గముననె పోవును. ఎప్పుడు నెవరిపైనను చాడీలు చెప్పరాదు. మంధరకు రామునిపై నింత పగయేటికి? చిన్నప్పుడు రాముడీమెను పరిహాసముచేసి యుండెనట. అదియేకారణము. ఇప్పుడీవిధముగా ఆమెపగ సాధించెను.

కైక యీావ్యసనముతో దన పడకింటికిబోయి పరుండెనుగదా. అప్పుడు రాముని బట్టాభిషేకము చేయ నిశ్చయించితి మనుసంతోషవార్త చెప్పుటకు దశరథుడు కైకయీా యొద్దకుబోయెను. ఆమె విచారముతో మాటలాడలేదు. అందుకు రాజు కారణమడుగగా నాడు దేవదానవుల కైనయుద్ధములో తనకొసగిన రెండువరము లిచ్చియున్నసంగతిని కైక జ్ఞాపకముచేసి, యా రెండువరము లిప్పుడిచ్చుటకు ప్రతిజ్ఞ చేసికొనెను. రాజు నీమె కపటభావ

మెఱుంగక ఆ రెండువరము లిచ్చుట కొప్పుకొనెను. అత డొప్పుకొనిన పిమ్మట ఆ రెండువరముల నడిగెను. ఈ వరము లేవి? మంథర యడుగుమనియుండెగదా యావరములె. అనగా మొదటివరము- భరతునకు బట్టాభిషేకము చేయుట యు: రెండవది- రాముని బదునాల్గేండ్లు వనవాసము చేయ బంపుటయు. ఈ వరములడిగిన వెంటనె దశరథుడు పట్టరాని దుఃఖముతో మూర్ఛిల్లెను. పిదప లేచి, కైకయి నెన్ని రీతులనో వేడుకొనెను. “భరతునకు బట్టాభిషేకము చేసెద గాక, రాముని నడవులకేటికి పంపవలయు? రాముని బ్రతి మాలికొందు- వేడుకొందు- రాజ్యాభిలాష మానుమందు- భరతుని కూడిగములు చేయుమందు- నీ కుపచారములు చేయుచుందు- అయ్యో! రాముని నడవులకు బంపజాల- ను వీవరము లడుగకుము- రాముడు నీ కొనర్చిన యపరాధ మేమి? రాముని సకలసద్గుణగణధాముని, వంశోద్ధారుని, కాననముల కంపుమనుటకు నీనోరెట్లాడెనే? అతడు నీకు కుమారుడుకాడా! సుకుమారుడుకాడా? అయ్యో! నా కుమారుని నా దండనుండనిమ్ము!” అని యెన్నివిధములనో బ్రతిమాలెను. శోకించెను. అతని శోకమువిన్న నెట్టి ఱాయియైనను కఱుగక ఉండజాలదు. గాని, కైకయొక్క మానసము దేనితో చేయబడినదోగాని, యామె మనసు మాత్రము కఱుగదాయె. ఉక్కుతో చేయబడియుండునా?

ఉన్నైకనను కలిగియుంటినే! అందుకు కామె మఱింత క్రోధముతో "రాజా! రెండు వరములిచ్చెదనని యొట్టుబెట్టి తివి. ఇప్పుడంతగ వగచుటకు కారణమేమి? వరము లివ్వలే దనుము. నా కంతయేచాలును." అని నిష్ఠురములాడెను. అందునకు దశరథు డెన్నివిధములనో యామెను ఈ దుర్మతి మును మానుమని బోధించెను. బతిమాలెను గాని, పట్టు పట్టిన కైక ముందీతని వేడుకలో లెంతమాత్రము పనిచేయ నయ్యెను. దశరథుడు చెప్పరాని దుఃఖముతో శోకించు చుండెను. అప్పుడు కైక "రాజా! ఒకసారి పలికిన సత్యమును క్రియలోనికి దెచ్చుట కింతవిచారమేటికి? సత్యమే మనుష్యుని ముఖ్యమైన ధర్మము. సత్యమువలననె ఈశ్వరుడు సంతోషించును; కావుననె గొప్పవారు ప్రాణము పోవుటకైన నొప్పుకొందురుగాని, సత్యహానికోర్వ జాలరు. నీవు నీసత్యమును నిలుపుకొనలేక పోయితివా నీ కన్నులయెదుటనే నా ప్రాణములను బాసెదను. ఇట్టి సత్యదూషకునకే నాలిగైై మనజాలను" అని యనెను. ఈ కఠోరవాక్కులు దశరథుని మనసును నొప్పించెను. వెంటనె యాతడు రామ లక్ష్మణులను బిలిపించెను. రాముడు వచ్చి దశరథునకును కైకయాకిని నమస్కరించి చేతులు జోడించు కొని "ఏమాజ్ఞ?" యని యడిగెను.

రాముని జూచినంత రాజునకు దుఃఖ మెక్కువయ్యెను

నోటమాట వెడలకయ్యెను. అతడు గొంతెత్తి యేడువ సాగెను. దశరథుని యీ యవస్థజూచి రామున కేమియు తోచదయ్యెను తండ్రి కింతటి దుఃఖమేటికి కలిగెనా యని యతడాలోచించెను. కారణ మేదియు నూహించుకొనడయ్యెను. కొంతసేపేమియు మాటలాడక, తండ్రి పలుక కుండుటనుజూచి, కైకయితో "అమ్మా! తండ్రిగారి కింతటివంత కలుగుటకు కారణమేమి?" అని యడిగెను. ఆమె జరిగినవృత్తాంతమెల్లయు రామున కెఱింగించెను. అప్పుడు రాముడు "తండ్రిగారియాన నేశిరసావహింతును. నే నిప్పుడె వనములకేగెదను. ఇంక నా తల్లిదండ్రులను సోదరులను రక్షించుభారము మీరే వహింపవలయు" నని వచించి తల్లికి నమస్కరించి వెడలిపోయి, కౌసల్యకీ యుదంతము దెలిపి యామె సెలవందు నుద్దేశముతో నామె మందిరమునకు బోయెను.

తన కుమారుని రాజ్యాభిషిక్తుడైన శుభవృత్తాంతము ఇప్పుడు విందుమాయని సంతోష సంభ్రమములతో నున్న కౌసల్యకు రాముడు మ్రొక్కి, కైక యింట జరిగినదంతయు దెల్పి "అమ్మా! తండ్రియాజ్ఞను పాలింపసమకట్టి నే నిప్పుడరణ్యములకు బోవనున్నాడను. నన్ను దీవించి శీఘ్రము మ పనుపుము" అని యనెను. ఆమె గొడ్డలిచే నఱుకబడిన ప్రానుచందమున నేలవ్రాలి మూర్ఛిల్లెను. రాము డామెకు

శైత్యోపచారములు చేయగా నామె లేచి కుమారుని కౌగి లించి యేడ్చుచుండెను. ఆమె దుఃఖము మహాఘోరము గానుండెను. ఆ దుఃఖమును జూడజాలక చెంతనున్న లక్ష్మణు డుగ్రుడై తండ్రిపై గోపించి కైకయు నిప్పుడే వధిం చెదనని వెడలెను. ఇంతలో రాముడతనిని బోనీక "మాతృహత్య సేయుదువా? తండ్రియానతి శిరసావహించు ట కుమారునకు గర్తవ్యము. అట్టియెడ తండ్రి నసత్యవాదుని జేయుటకే నియ్యకొందునా? నేనే సంతోషముతో బోవు చున్నప్పు డింక మీ రామెనేటికి దూషించెదరు? సౌమిత్రి లక్ష్మణా! నీ యీకోపము విడుము. నీకోపము మూలమున నెంతటి పాపకృత్యమొనర్పనుంటివి. తండ్రిచేపట్టిన తల్లియే! ఆమెనా నీవు చంపుట? వలదు కుడుగుమా నీ యాగ్రహము" అని బోధించెను. లక్ష్మణు డందుకు పశ్చాత్తాపపడి తానొన ర్చిన యపరాధమును క్షమింపుమని యన్నను వేడెను. శోకసాగరమున మునిగియున్న కౌసల్య నెట్టెట్లో యూర డించి, యామె సెలవంది రామచంద్రుడు తన భార్యయగు సీతాదేవి మందిరమున కేగెను.

ఆమెతోడ నీ యుదంతమెల్ల యునుడివి "నేను పదు నాలుగేండ్లరణ్యవాసముచేసి వచ్చెదను. నీవింటనే యుండుము" మనియెను. ఈమాటలు విన్నంతనే యామె దుఃఖమును బట్టలేక "అయ్యో! ఎట్టియాపదకలిగెను. మీరడవులలో

విరుగుచుండ మీయర్థదేహమనగు నేనుమాత్రమే రాజగృహ ముననుండగలనా ? మీవెంట నేనువచ్చెదను. వలదనకుడు. మీపాదములయాన, మిము బాసియుండజాలను. ఉన్న బ తుకజాలను" అని వేడెను. రాముడెన్ని విధములనో బోధించెను. అరణ్యవాసము స్త్రీలకు దగనిదనియెను. క్రూరరాక్షస సం చారభూమి ; ఘోరభీకరమృగములకావాసభూమి ; భూత ప్రేతపిశాచాదులకు జనన భూమి; కంటక కలితకానన భూమి ; యనియనేకరీతుల జెప్పి యామెనరణ్యమునకు రావ లదనెను. మఱియు "నీవు నావెంటవచ్చిన వృద్ధురాలగు మాయమ్మ కుపచారము లెవరుచేయుదురు ? ఇచ్చట గృహకృ త్యములయందు మాయమ్మ వరుతోడ్పడుదురు ? మాయమ్మ దుఃఖమునుదీర్చువా రెవరు? కావున నీప్రయాణమునుమాను" మనియెను. ఎన్నిచెప్పినను పరమపతివ్రతాతిలకమగు సీత నుగనివీడియుండుటకొల్లదయ్యెను. ఆమె యభీష్టము దీర్చుట కై రాముడామెను దనవెంట దీసికొనిపోవుటకు సమ్మతించి, లక్ష్మణునిజూచి "తమ్ముడా! లక్ష్మణా! ఇంక నింటనెల్లరిని పాలింపవలసినభారము నీపైనున్నది. నావియోగము మూ లమున నెతగుందుచుండు మనమాతాపితరుల కుందుమాన్చి యుపచారముల సలుపుచుండుము. నీవుబుద్ధిమంతుడవు. నీకు నేనుచెప్పవలసిన నీతు లెవ్వియుండగలవు! అయిన నొక్కటి మాత్రము నీమనసునందుంచుము. రాజ్యముపై నాకలేశమా

త్రము వహింపకుము. పొమ్ము. పరమేశ్వరుడు నీకు శుభ మొసూర్చుగాక!" అనియనెను. కాని, లక్ష్మణుడంతకు మున్నె ధనుర్బాణములను జేతధరించి రాముని వెనువెంట నర ణ్యములకుబోవ సంసిద్ధుడైయుండెను. ఇప్పుడు రాముని యుప దేశవాక్యములు వినినంతనె యతని యాశయంతయు నశిం చెను. కన్నులనిండి యశ్రువులు నేలబడజొచ్చెను. వడకు చున్నకంఠముతోనతడు "అన్నా! నీవింతటికఠిన మానసుడ వయ్యెదవని కలలోనైన దలంపనైతి! అయ్యో! అరణ్యము లలో నీవు వది యు కష్టములు పడుచుండ నేనిటనుండ గలనే? నిను రాజ్యభ్రష్టునిజేసిన కైకయి సుతునకుపచారము లుచేయుచుందునే? అక్కటా! సుకుమారుడనగు నీవు నడచి నడచి యలసియుండ నీకు భోజనమునకై కందమూలాదుల నెవరు తెచ్చి నీకిచ్చెదరు? కావలసినపుడెల్ల నీకు నీళ్లెవ్వరు తెచ్చి యీయగలరు? అలసటవలన మీరిరువురు పగలంతే నిద్రించు నపుడేఘోరమృగములును భయంకరాకారులగు రాక్ష సులును మీపైబడకుండునట్లు మిమ్మెవ్వరు రక్షింతురు? అన్నా! ఒంటరిగ నీవు వదినతో నరణ్యములకుబోవ నెంట నె ప్పటికైననుండవలదే? చిన్ననాటనుండియు మనమిరువురము నొక్కచోటనె మెలగితిమే! నీసుఖముసే నాసుఖమని భా వించితినే! అన్నా! నీకింతటి కాఠిన్యము తగదు తగదు. నీవు లేక నేనీ రాజ్యము పాలింపజాలను. నేను నీ వెంటవచ్చెదను.

వనువలసనకుము" అనివిలపింపదొడగెను. అందునకు రాము డు లక్ష్మణునకు దనయెడగలుగు భాతృస్నేహమునకు, ప్రేమ కు, దయకు, భక్తికిసంతసించి, ఆనందాశ్రువులతో నాతని గౌగిలించి "తమ్ముడా! నీవునావెంట వత్తువుగాక! లెమ్ము!" అనియూఱడించెను.

(సీతారామలక్ష్మణులు వనములకేగుట).

రాముడును సీతయు లక్ష్మణుడును వనములకేగుటకై యనుజ్ఞనడయుటకు తండ్రియొద్దకువచ్చి తండ్రికిని తల్లులకును నమస్కరించి "తండ్రీ! వనప్రయాణమునకు సిద్ధముగనున్న మాకనుజ్ఞనిం" డని రాముడడిగెను. పాపము, దశరథు డేమి చేయగలడు? నోటమాటరాదయ్యెను. దుఃఖము పొట్ట నిండి పొరలి పొరలి వచ్చుచుండెను. ఆతడెట్లు మాటలాడ గలడు? ఆతడొక్కడేకాదు. ఇంటనున్నవారెల్లరు నేడువసా గిరి. సుమంత్రుడు రథమును సిద్ధపఱచితెచ్చెను. ఎల్లరియ నుజ్ఞనువడసి యా మువ్వురును రథమునెక్కి వెడలిరి. ఆహా! అప్పురజనుల దుఃఖము నేమనిచెప్పవచ్చును! రాముడడవికి పో వుచున్నాడని యేడువనివారు లేరు. ఇంతయగుటకు కారణ భూతురాలైన కైకేయిని తిట్టనివారు నుండలేదు. సుమంత్రు డు శ్రీరామ లక్ష్మణ సీతలను తమసానదీతీరమున డించి రథ మును మరలించి యయోధ్యకు తోలుకొనివచ్చిచేరెను. అప్పు డు దశరథుడు "రామా! నిన్నుమరల నే నెన్నడుచూడగలను?

నీన తెటి కుమారుడనైతిని! నిన్ను బాసి నే బ్రతికియుండగలనా? తనయా! నీవులేని యీ రాజ్యవిభవము నాకేల? ఈ సౌధవాసము నాకేల? ఈ ధనము నాకేల? హా! రామా! రమ్మా! ఒక్కమాఱు కౌగిలింపుమా! పున్నమనాఁటి పూర్ణచంద్రుని వెక్కిరింపజాలు నీ మోము నొక్కసారిచూపుమా! రామా! నీ తండ్రిని ఈ కలుషాత్ముని ఇంత వెతగుంద జేసిపోవ న్యాయమా? అయ్యో! తండ్రీ! సకలసద్గుణగణములకాలపట్టయి, సకలవిద్యావిశారదుడవయి, నీతిజ్ఞుడవై, ప్రజల కామోపచంద్రుండవై కౌసల్యాగర్భమున నుద్భవించి ముత్యంబవై, నా నోములకు ఫలంబవై జానకీమనోహరుండవై, నెగడుచుండి, నా వార్ధక్యమున- ఈ నీచదశను- దిక్కులేనిచావు నాకు గలిగించితివే! తనయా! నే జీవించియుండగనే సకల మహీభారమును నీపై మోపి, కాననములకేగి నేను తపమున ముక్తినడయు నిలచితినే! రామా! సుగుణాభిరామా! నీవే యరణ్యములకు బోయితివే! అయ్యో! నేనెట్లు జీవింతును? కడసారి- ఒక్కసారి- నీ చల్లనిచూపు జూపరాదా? ఇంతకఠినమా? ఇసుమంతజాలి లేదా?" యని పలుదెఱంగుల వర్ణించుచు, చెంతనున్న వారికి కూడ దుఃఖముగలిగించుచు, తనినూఱడింప వచ్చినవారిని సైతము వెతలముంచుచు ఏడ్చుచు, నెత్తిగొట్టుకొనుచు, చేతులు పిసికికొనుచు, దుఃఖించుచుండెను. ఎలుగెత్తి యేడ్చుచుండెను. కొంతతడవు ఒడలు తెలియక మూర్ఛిల్లి; లేచి కల

సరించు; ఎదుటగనబడినవారినెల్ల "రామా! రామా!" యని పలుచు. తుదకదేదుఃఖమున "రామా! రామా!" యనుచు ప్రాణమువిడిచెను. అతని ప్రాణముపోవునప్పుడు అతనికి శ్రావణునిశాపము జ్ఞప్తికివచ్చెను. (పూర్వమొకప్పుడు దశరథ మహారాజు వేటకై యడవులకేగియుండ, నొక సరోవరముచెంత శ్రావణుడను నతడు వృద్ధులగు మాతాపితరులను సేవించుచు దపసుచేయుచుండెను. అతడు నీటికై యా సరోవరమునకు బోయి పాత్ర నీటిలోముంచెను. నీటిచప్పుడువిని, దశరథుడు ఏదియోమృగము నీరుత్రాగుచున్నదని యనుకొని చూడకయే వింటబాణము వెట్టికొట్టెను. ఆబాణ మాశ్రావణునకు దగిలి అతడు మరణించెను. ఈ సంగతి తెలిసికొని రాజావృద్ధులును, అంధులునునగు శ్రావణుని మాతాపితరులచెంతకేగి యావృత్తాంతము తెలిపి, కేవలమజ్ఞానముమూలమున నిట్టి మహాపాతకబద్ధమయ్యెనని మనివెను. అందున కావృద్ధులు తమ సదాచారములొనరించుచున్న కుమారుడు చచ్చినదుఃఖమును బట్టలేక "రాజా! నీవును మావలెనె పుత్రవియోగము నొందగలవు! ఆపుత్రుని పేరుచ్చరించుచునే చత్తువుగాక!" యని శపించెను. ఇప్పుడు దశరథునకు నాశాపము జ్ఞప్తికివచ్చెను).

దశరథుడు చచ్చినవెంటనె మంత్రి నందిగ్రామమునను న్న భరతుని బిలుచుకొనివచ్చుట కొకదూతనంపెను. భరతుడయోధ్యకు వచ్చినపిదప జరిగినవృత్తాంతమంతయునువిని, మి

క్కలి దుఃఖించి రాముడరణ్యమున కేగుటకును, తండ్రి చచ్చు టకును కారణమాకైకేయిగదా! యని దుఃఖావేశమున తల్లిని ప్ర గోపించి, యామె ననరానిమాటలనెను. కైకేయి చాలనొచ్చు కొనెను. భరతుని—తనకుమారుని—మేలుకోరకే కదా తాను రాముసరణ్యములకంపుమనికోరినది? ఈహితమీతనికి అహిత ముగదోచెను. ఆమెయును తానొనరించిన ఘోరకృత్యమును గూర్చి చింతించుచుండెను. ఆమెకు, పాపము—వైధవ్యము సం ప్రాప్తమయ్యెను! ఈ దుఃఖమునుబట్టలేక, తానీరీతి యగుటకును గారణమా కుర్మార్గురాలగు మంథరయుపదేశమే కదా; "అ య్యో! నేనేటికామంథరయుపదేశమునువింటిని? కన్నతల్లిని కన్న నెక్కుడుగ నన్నాదరించు నా రాముడు—నా రాముడు—అ డవులపాలయ్యె! నాకోడలికన్న నెక్కుడుగ నన్నుపచరించు సీత యు నడవులపాలయ్యెను; హా! లక్ష్మణా! నిశ్చయముగానీవే నీ యన్నకు దమ్ముడవు! ప్రాణనాథుడు, నన్నువైధవ్యదుఃఖమునము చిపోయెను! కుమారుడీరాజ్యమునొల్లడట! నాకొడుకనియన్న నుతనకు బాపముచుట్టుకొనుసట! అయ్యో! కుమారునకు పగి దానసైతిని. ఇంతకునుగారణమామంథరయేగదా!" అని విల పించుచుండ, శత్రుఘ్నుడువిని, కోపముతెచ్చుకొని, ఒడలుతె లియక మంథర చేతులు కాళ్లునుగట్టి చంపబోయెను. అప్పుడు భరతుడడ్డుపడి "తమ్ముడా! శత్రుఘ్నా! ఎంతటి ఘాతుకకృత్య మొనరింపనుంటివి? ఇప్పుడే ఘోరపాతకులమైయున్నాము—కా

వునని కడకొకసారియైనను మమ్ము జూడక, మాతో జెప్ప
క, అన్న కానలకేగియున్నాడు. ఎప్పుడైనను మరలకలియుదు
మేమోయని నాకింతయాశగలదు. ఇప్పుడీస్త్రీనిహత్యచేసిన,
స్త్రీహత్యచేసిన పాతకులమని మమ్ము జూడన్నైనజూడడు. మన
వంశమునకే యపకీర్తికలుగును. వీరపురుషుడెన్నడును స్త్రీల
నుజంపడు. ఇంక నీకోపము త్యజియింపుము" అని బోధింప,
నతడూరకుండెను. భరతుడు "ఈ రాజ్యము రామరాజుది. అ
తడేలవలసినది. అన్యాయముగా జననియార్జించినరాజ్యమునకే
నధినాథుడనుకాజాలను. ఎట్లయినను అరణ్యములకుబోయి,
రాముని సందర్శించి, బ్రతిమాలి, యతనిదెచ్చి రాజ్యమేలజేసె
ద. తమ్ముడా! ఇదుగో నేనరణ్యములకేగుచున్నాను" అనిచెప్పి
కౌసల్యామందిరమునకరిగె. ఆమెకునమస్కరించి, తాను నిర
పరాధుడనియు, రామునెట్లయినదెచ్చెదననియుజెప్పి, యర
ణ్యములకుబోవననుజ్ఞవేడెను. అందునకామె తన్నుగూడ వెం
టదీసికొనిపొమ్మనికోరెను. ఆమెబయలుదేరగా, తక్కినయం
తఃపురకాంతలును పరివారసమేతముగా బయలుదేరిరి. కుల
గురువగు వశిష్ఠుడుసైతము పయనించెను.

(భరత సందర్శనము)

రాముడు లక్ష్మణుడు, సీతయు నరణ్యములలో సంచ
రించుచు గంగాతీరమునకువచ్చిచేరిరి. అక్కడగుహుడను నిషా
దుని రాజ్యముకలదు. ఆతనికి రాముడు వచ్చుచున్నాడను

సంగతి తెలిసెను. గుహుడు రాముని సందర్శించుటకై వచ్చి, యామువ్వురిని దగినరీతిని సత్కరించి, తననావలో వీరిని గూర్చుండబెట్టుకొని గంగానదిని దాటించెను. అటనుండినడచి ప్రయాగమునకు బోయి భరద్వాజ ఋష్యాశ్రమమునకుబోయిరి. అచ్చట వీరికి దగిన మరియాదలు జరుపబడెను. భరద్వాజ ఋషీశ్వరుని దీవెనలంది, యటనుండికదలి చిత్రకూటమునకు బోయిరి. అచట వాల్మీకి ఋష్యాశ్రమముండెను. ఆయాశ్రమము చెంతనె లక్ష్మణుడొక చిన్న పర్ణకుటీరముకట్టె. దానిలో నీమువ్వురును నివసించుచుండిరి. సీత కుటీరమునందుండెను. రాముడు తమ్మునితో నేమియో ముచ్చటించుచుండెను. ఇంతలో భరతుడును, శత్రుఘ్నుడును, శ్రీరాముని సన్నిధికరుదెంచి, నమస్కరించి, అయోధ్యలో జరిగినవృత్తాంతమెల్లయును విశదీకరించెను. "అన్నయ్యా! కైకేయినిక్షమింపుము; దీనులమగు మాయెడగరుణింపుము; అయోధ్యకుమరలివచ్చి రాజ్యము నీవేలుకొనుము" అని చేతులుజోడించుకొని వినయముతో ప్రార్థించెను. దశరథుడు గతించినవార్తవినినంత రామలక్ష్మణులును, సీతయు రోదింపదొడగిరి. వశిష్ఠుడు వారిని సమాధానపరుప శాంతివహించి, గురువునాజ్ఞమేరకు ఫల్గూనదీతీరమున తండ్రికి శ్రాద్ధాదిక్రియలుసలిపి, భరతునకు మగిడిపోవననుజ్ఞనిచ్చుచు "తమ్ముడా! కైకేయి యేమియు నపరాధముచేసి యుండలేదు. ఆమెయొక్కయు దండ్రియొక్కయు నాజ్ఞలను

పాలించుటయే క్షత్రియధర్మము. రాజసింహాసనమిాకే తగి చాలకాలము రాజవిహీనముగా నుండదగదు. రాజ్యమరాజకమగును. అనేకపాపములుకలుగును. ప్రజలు కలహింతురు. శత్రురాజులు దండెత్తివత్తురు. కావున, అతిశీఘ్రముగా సరిగి రాజ్యకార్యమును వహింపుము. ఈరాజ్యము నీవేలిన నేమి, నేనేలిన నేమి? అన్నియు నొక్కటియే. పదునాల్గేండ్లు గడచిన పిమ్మట పునర్దర్శనము లభింపగలదు." అని యనెను. భరతుడెంతయు చింతించి రాముని విడిచిపోవకుండెను. గురువగు వశిష్ఠుడును శ్రీరామున కెన్నివిధములనో యయోధ్యకు మరలివచ్చుటకు విన్నవించెను. అందుకు రాముడు "గురువర్యా! మీరు నీతిపరులుకారే? తండ్రి నసత్యవాదిని జేయగలనా? పదునాల్గేండ్లుకదా? ఎంతలో ముగియగలదు? మిాకంతటికిని కోరిక కలదేని, రాజ్యభారము పట్టుకొందును" అని యూరడించెను. భరతుడు ఇంకనితనితో వాదులాడుటలో నేమియులాభము లేదని యెఱింగి "అన్నయ్యా! నాకొక్కవరమి"మ్మని వేడెను.

రాముడు- అదియేమియో యడుగుము.

భరతుడు- రాజ్యమునీయదె. నేనేలిన నీకుప్రతినిధిగ నేలవలయు. ఆసింహాసనము నధిష్ఠించుటకు నాకర్హత లేదు. కావున నాయందు కృపవహించి నీపాదుకల నిటులిమ్ము. వానికిపట్టాభిషేకముచేసి, శత్రుఘ్నుని రాజ్యకార్యములనిర్వహింపనియమించి,

నేను మునివృత్తిఁబొంది నందిగ్రామమున నీరాకకై యెదురు చూచుచుండెదను. ఈ పదునాల్గేండ్లు ముగిసిన వెంటనే రావలయు. అటునీవు రాకపోయితివా నేనగ్నిప్రవేశము జేసి చచ్చువాఁడను.

వశిష్ఠులు:— రామా! ఇది సమంజసముగానున్నది. ఇటుచేయుము. మాకందఱికిని ఇదిహితమె.

కౌసల్యమొదలగునంతఃపుర స్త్రీలును సమ్మతించిరి. రాముడింక విధిలేక భరతునియభీష్టము దీర్పవలసివచ్చెను. తన పాదుకలనుదీసి పట్టాభిషేకము జేయ భరతునకిచ్చెను. భరతుడు పరివారసహితుడై వెడలిపోయి, తాననినట్లు పాదుకలను సింహాపీఠికనుంచి, రాజకార్యముల నిర్వహించుటకు శత్రుఘ్నుని నియమించి, జటయువల్కలములధరించి భరతుడు మునివృత్తిని దపము జేయుటకై నందిగ్రామమునకుబోయి, యటదినములు లెక్కపెట్టుచుండెను.

---

# 3. అరణ్యకాండము.

( సీతా రామ లక్ష్మణులరణ్యమున నివసించుచుండగా నటజరిగినవృత్తాంత మీకాండమున జెప్పియున్నందున, నీకాండమునకు "అరణ్యకాండము" అని పేరుపెట్టబడియున్నది)·

(లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోయుట).

భరతుడు రాముని పాదుకలను దీసికొనిపోయిన తరువాత రాముడును లక్ష్మణుడును సీతయు అత్రిఋషీశ్వరుల యాశ్రమమునకు బోయిరి. అట అత్రిఋషిభార్యయగు అనసూయ వీరిని ఆదరించి, సీతకు కొన్ని యలంకారములిచ్చెను. తరువాత ఋషీశ్వరునిదీవెనలనుబడసి, యటనుండి కదలి దండకారణ్యమునకుపోయి పంచవటీ అనిపేరుగలవనములో గోదావరీతీరమున ఒక పర్ణకుటీరము నిర్మించి యందుండిరి. రాముడు కుటీరముననేయుండి సీతను రక్షించుచుండ, లక్ష్మణుడు కందమూలఫలాదులనుదెచ్చి అన్నకు వదినెకునిచ్చి వారుభక్షించిమిగిలినదానునుదినుచు కాలముగడపుచుండెను. ఈరీతిగ కొంతకాలము గడచెను. అనంతర మొక్కనాడు శూర్పణఖ అను పేరిటి రాక్షసి వీరిదగ్గరకువచ్చి యేదో దుర్మార్గమైన కోరికలుకోరగా, రామచంద్రుని ఆజ్ఞవడసి లక్ష్మణుడు ఒక్కబాణము ప్రయోగించి యా రాక్షసి ముక్కును జెవులుకోసివేసెను. అందుకా రాక్షసి యేడ్చుచుబోయి ఖరుడు, దూషణుడు, మొదలుగాగల తనతోడివాండ్రగు రాక్షసులతో నీసంగతిన తెయజెప్పెను. అప్పుడు భయంకరాకారులగు రాక్షసులపరివారము రామచంద్రునిపై యుద్ధమునకువచ్చెను. రామచంద్రుడు వీరి కెంతమాత్రము భయపడకయె వీరినందఱినిఎదిరించెను. త్రిశిరుడు, ఖరుడు, దూషణాదులను మొదలుగాగల భయంకరులు

ను పరాక్రమవంతులును రామునివంటియొకబాలునిచేత యుద్ధములో దెబ్బలుతినిచచ్చుట యెంతవింత! అని యాశ్చర్యముతో విచారించుచు శూర్పణఖ తనతమ్ముడగు రావణుని దగ్గర కరిగి యావద్వృత్తాంతము నాతనికెఱిగించికొనెను. తనకవమానముచేసిన రామలక్ష్మణులను దండింపవలెనని చెప్పెను. రావణుడు లంక అనుద్వీపమునకు రాజు. అతడు రాజసభలో కూర్చుండియుండెను. అప్పుడు శూర్పణఖ యేడ్చుచువచ్చి తనకు జరిగిన యాపదయు బరాభవము నివేదించి "అయ్యో! నీ విక్కడ నెమ్మదిగ కూర్చున్నావేమి? అక్కడనొకబాలకుడెంతచేయుచున్నాడు! వానినిప్పుడే దండింపకున్న మీ సర్వస్వమును నాశముచేయుగలడు. వాడు నాముక్కును చెవులునుకోసి నన్ను సౌందర్యహీనురాలిని గావించెను. ఖరదూషణాదులగు బలాఢ్యులనతడు ఒక్కడే చంపివేసెను. అతనితో నొకస్త్రీయున్నది. ఒకతమ్ముడున్నాడు. ఆస్త్రీ మిక్కిలిచక్కనిది. మూడు లోకములు నేలు నీకే యారత్నము తగియున్నదని నేనుసాక్షిగ చెప్పగలను." అనియనెను.

(సీతాపహరణము).

చెల్లెలు పడుచున్నయవస్థనుజూచియు, ఆమె వచించిన మాటలువినియు రావణుడు మిక్కిలిచింతించి, యేయుక్తిచేతనైనను రాముని శీఘ్రముగాను చంపవలెనని యెంచి, మారీచుడను రాక్షసునిదగ్గఱకేగి "మారీచుడా! ఏవిధి నూయోపా

యములచేతనైననుసరియే, సీతను దొంగిలి[redacted] నా దగ్గఱకురమ్ము" అని యాజ్ఞాపించెను. అందుకు మారీచుడు విచారముతో "ప్రభువా! ఇదిమిక్కిలి క్రూరకృత్యము. మీకీదుర్బుద్ధులెవరునేర్పిరి? ఇతరులస్త్రీలను ఆశించుటదగునా? ఇటుచేసిన కుంభకర్ణుడు విభీషణుడు మొదలగు సోదరులతోడను ఆప్తజనులతోడను మీరు నాశమొందగలరు. కావున ఈబుద్ధిమానుడు" అని హితమునుపదేశించెను. కాని, మరణమునసమీపించిన రోగికి ఔషధము ఏవిధముగారుచింపదో ఆతీరుననే మారీచుని హితోపదేశము రావణునకు రుచింపలేదు. అతడు కోపముతో కన్నులెఱ్ఱచేసి మారీచునిగని, చేతికత్తి ఝళిపించుచు "ఓరీ! మూర్ఖుడా! నాయాజ్ఞనుమీఱెదవా? నాకుబుద్ధులుచేర్పునంతటివాడవేనీవు? నా యీకార్యముచేసితివా నీవు బ్రతికియుండగలవు, లేకున్న ఇప్పుడే నీతలను నఱికివేయుదును" అని యుగ్రముగాబలికెను. మారీచుడింకేమిచేయగలడు? విధిలేక సీతనుఅపహరించితెచ్చుటకొప్పుకొనెను. రావణుడును మారీచుడును ఒక్కరథమునగూర్చుండి దండకారణ్యమునకుబోయిరి. మారీచుడు బంగారువర్ణముగల యొకచక్కనిలేడిరూపముధరించి సీత నివసించుచుండిన పర్ణకుటీరముదగ్గర, ఆమెచూడవలెనని, ఇటునటుదిరుగుచుండెను. ఆలేడిరంగు బంగారమువంటిది. కొమ్ములు పగడమురంగుగలది. దేహముపైని వెండ్రుకలు ముత్తెములవలె తెల్లగనుండెను.

కన్నులు రత్నములవలె ప్రకాశమానములై యుండెను. ఇట్టి సుందరరూపముగల యాలేడిని చూచిన ఎవరు దానిని బట్టుట కపేక్షింపరు? సీత దానిని చూడ, ఆమెకు దానిని పెంచవలెనని కోరిక పుట్టెను ఆమె తనకోరిక రామున కెఱిగించి, యెట్లైనను దానిని పట్టి తెమ్మని యతనిని ప్రార్థించెను. అప్పుడు రాముడు ఆమెకోర్కె తీర్చుటకు దానులేడిని పట్టబోవుచు లక్ష్మణునితో "తమ్ముడా! లక్ష్మణా! ఇట మీరు వదినను కాపాడుచుండుము. ఇచట మృగములు సంచరించుచుండును, రాక్షసులు వత్తురేమో! జాగ్రత్త! నేనితలోనె యాలేడిని పట్టి తెచ్చెదను" అని చెప్పి, లక్ష్మణుని సీతకు కావలియుంచి లేడి వెంబడి బోయెను. ఈ హరిణము పరుగెత్తుచుండ రాముడు దాని వెంట బరుగువారుచుండెను. లేడి పర్ణకుటీరమునుండి చాలదూరమువరకు రాముని దీసికొనిపోయెను. పిదప రాముడు మారీచుని కపటము నెఱిగి యొక బాణము నాలేడిపై ప్రయోగించెను. ఆలేడికా దెబ్బతగిలెను. అప్పుడు లేడిగామారియున్న మారీచుడు బిగ్గరగా రాముని కంఠమువలనే తనకంఠస్వరము మార్చి "హా! సీతా! హా! లక్ష్మణా! రండు- నన్ను రక్షింపుడు" అని యఱచెను. ఈయఱపువిని సీత లక్ష్మణునితో "లక్ష్మణా! మీయన్నగారి కేదియో అపాయము సంభవించినది. 'హా లక్ష్మణా! రమ్ము- రక్షింపుము' అని యఱచుచున్నారు; కావున వేగమే మీయన్నగారి సహాయార్థముఱు

ము" అని భయముతోననియెను. అంతటను లక్ష్మణుడు "వదినెగారు! ఈకంఠస్వరము అన్నగారిదికాదు. మీరేమియు జింతింపకుడు. అన్నగారి కెవరివలనను ఏకీడును మూడజాలదు" అని యామెనుఊఱడించెను. ఆమెవినదు. ఇతడెన్ని తెఱఁగులనామెను నెమ్మదిపఱచుటకు తగుమాటలు చెప్పినను వినక, దుఃఖముతో ఆమె లక్ష్మణునిపై కోపించెను. ఇంక నేమి చేయగలఁడు? ఎట్లయిననుసరియె. ఈమెమాటమీఱరాదని యనుకొని లక్ష్మణుడు రాముడు పోయినదారినిబట్టి పోయెను. ఇప్పుడు కుటీరములో సీతయొక్కతెయె దుఃఖించుచుండెను. ఇదే సమయమని రావణుడు యతివేషము ధరించి బిచ్చముపెట్టుమని సీతఇంటియొద్దకువచ్చెను. ఆమె బిచ్చమువేయబోవగా ఆ రావణుడామెను ఎత్తుకొని రథముపై గూర్చుండబెట్టుకొని రథమును మహావేగముతో దోలుకొని, లంకత్రోవబట్టిపోయెను. అప్పుడాసీత యేడ్చుచు గట్టిగా రామలక్ష్మణులను బిలుచుచుండెను.

ఇంతలో గరుత్మంతునికుమారుడగు జటాయు వెచ్చటనుండియోవచ్చుచుండగా సీతయేడుపులతనికి వినబడెను. అంతనె యాజటాయు వారావణునితో నామెనువిడువుమని యెన్నివిధములనో చెప్పెను; గాని రావణుడు వినడయ్యెను. అప్పుడు కోపముతో జటాయు రావణునిరథముపై దూకి ధ్వజమును విరుగగొట్టెను. సారథినిజంపెను. రావణునివీపుమీదిమాంసముకూడ కొంచెమునోటితోపట్టిలాగెను. కాని, రావణునిపం

అతిపరాక్రమవంతుడు మూడులోకములయందు నెవ్వడును లేడు.
ఇంక నీజటాయు వెంతటివాడు? రావణుడు కోపముతో బాణము
ను బ్రయోగించి జటాయువు రెక్కలనువిరుగగొట్టెను. రెక్క
లువిరిగినంతనె జటాయుబలమంతయునశించెను. ఆతడుక్రింద
పడిపోయెను. రావణుడు జటాయుచూచుచుండగానె సీతనెత్తి
కొని వెడలిపోయెను.

ఇక్కడ లక్ష్మణుడు రాముని వెదకుచు బోవుచుండగా
రాముడెదురై వచ్చుచుండెను. అతడు లక్ష్మణునిచూచి "సీత
నొంటిగావిడిచి యిచటికేలవచ్చితివి?" అని ప్రశ్నించెను. అం
దునకు లక్ష్మణుడు జరిగినవృత్తాంతముచెప్పెను. ఇట్లు వీరిరు
వురును మాటలాడుచు కుటీరముదగ్గరకువచ్చిచేరిరి. అందు
ప్రవేశించిచూడగా సీత కానరాదయ్యెను. ఎచ్చటెచ్చటనో
వెదకిరి. గట్టిగాపిలిచిరి. ఎచ్చటనుగనబడదు. మారుపలకదు.
ఈమెయెందునుగనబడకుండుటవలన రామునకు దుఃఖముకలి
గెను. ఆమెనుదలచియేడ్వమొదలుపెట్టెను. ఈదుఃఖముచే
నతడు పిచ్చివానివలె ప్రవర్తింపసాగెను. కొండలందునను,
గుహాలలోను, చెట్లనీడలను, నదీతీరములయందును- అన్నిచో
ట్లనువెదకెను. ఆమె కనబడలేదు. ఈయననుమతెంతదుఃఖ
మెక్కువయయ్యెను. ఇట్లన్నిచోట్లను వెదకుచువెదకుచు జటా
యువడియున్నస్థలమునకువచ్చిచేరిరి. జటాయువు రామలక్ష్మణు
లనుజూచినంతనె రావణుడు సీతనెత్తికొనిపోవుచుండెననియు,

నామెనువిడిపించుటకై రావణునితో దానుపోరాడగా దనకిట్టి దురవస్థకలిగెననియు మొదలుగాగలసకలవృత్తాంతములు చెప్పి "రామా! నీవిటకువత్తువేమో, సీతాదేవియుదంతమును నుడివి చత్తుగాక అని యింతవరకును నాప్రాణములను బిగబట్టుకొనియుంటిని, ఇప్పుడు నిన్ను దర్శించితిని. ఇంక నేను నిశ్చింతగా మరణించెదను" అని చెప్పి జటాయుప్రాణము విడిచెను. సీతనుగుఱించి జటాయువుపోరి ప్రాణము విడిచినందున రాముని మనసు కఱిగి, అతనిమీద మిక్కిలి కరుణకలిగి, ఎవరైన దగ్గఱిచుట్టము చచ్చిననప్పుడెంత దుఃఖముకలుగునో యంతదుఃఖముతో రాముడు ఏడువ మొదలుపెట్టెను. కొంతసేపటికి దుఃఖము నణచుకొని రాముడా జటాయువునకు దహనక్రియలొనరించి సీతను వెదకుచు ముందుకు బోయెను.

## 4. కిష్కింధా కాండము.

(కిష్కింధానగరమున జరిగిన చరిత్రము నీకాండమున వివరించియున్నందున ఈకాండమునకు "కిష్కింధాకాండము" అని పేరుకలిగినది).

(సుగ్రీవునితోటి సఖ్యము).

రావణుడు సీతనెత్తికొని దక్షిణదిక్కున లంకకుపోయె

నని జటాయువు చెప్పినప్పటినుండియు, నామె నేవిధముగా మరల దీసికొనిరాగలమా యనువిచారముతో రామలక్ష్మణులు మునిగియుండిరి. రాముడు, తానుబోయినదిక్కునుగుర్తించి వెంటవచ్చి తన్నురక్షించునను నపేక్షతో సీత తనయొంటిమీదిసొమ్ములుతీసి చీరచెఱగుకొంచెముచింపి వానినందులోకట్టి క్రిందపడవేసియుండెను. ఆగుర్తుననుసరించి యామార్గమున నామెను వెదకుచు రామలక్ష్మణులరుగుచుండిరి. అటుపోవగాబోవగా ఋష్యమూకపర్వతమునకు సమీపమున పంపాసరోవరముచెంతకువచ్చిచేరిరి. ఆసరోవరము కిష్కింధారాజ్యములోనిది. ఆకిష్కింధారాజ్యమును వాలి యనురాజు పాలించుచుండెను. అతనికి సుగ్రీవుడను తమ్ముడొకడుండెను. ఆయన్నదమ్ములకు బద్ధవైరము. మారుతిసహాయమున రామలక్ష్మణులకును సుగ్రీవునకును స్నేహముకలిగెను. వారివారికథలన్నియుజెప్పికొనినపిమ్మట సుగ్రీవుడు "వాలినిజంపి కిష్కింధకు నన్నురాజుగాజేసిన నా సకలసైన్యముతోవచ్చి, సీతనువెదకి మరలమీకిప్పించెదను" అని రామునితోననెను. అందుకు రాముడుసమ్మతించెను.

వాలిసుగ్రీవులకు వైరముకలుగుటకు కారణమువినుడు:— తండ్రిమరణానంతరము వాలి జ్యేష్ఠపుత్రుడైనందున రాజయ్యెను. పిదపకొన్నాళ్ళకు మాయావియను అసురునితో వాలికి యుద్ధముకలిగెను. వాలియుసుగ్రీవుడునుగలిసి మాయాసురునితో యుద్ధముచేయుచుండగా నాయసురుడు భయపడి పారిపోయి

యొకగుహలోజొరబడెను. వాలియునాగుహలో జొచ్చుచు సుగ్రీవుని నాబిలద్వారముననుండుమని చెప్పిపోయెను. వాలి మరలబయటికిరాలేదు. సుగ్రీవుడొక్కసంవత్సరమా బిలద్వారమునను కాచియుండి యన్నరాకకై యెదురుచూచుచుండెను. కాని అన్నరాలేదు. గుహాముఖద్వారమువరకు నెత్తురు ప్రవహించుచుండెను. సుగ్రీవుడదిచూచి, తనయన్న నా మాయావి చంపెననితలచి, యాబిలద్వారమునకొక పెద్దబండనుమూసి తానింటికిమరలివచ్చి సింహాసనమునధిష్ఠించి తానురాజయ్యెను.

ఈగుహాలో వాలి అసురునిజంపి గుహాముఖముకువచ్చి చూడగా అది మూయబడియుండెను. బయటవెడలుటకు వేరుమార్గములేదు- అప్పుడు వాలికి సుగ్రీవునిపై చాలకోపము కలిగెను. ఏదోయొకయుక్తిచేత బయటికివచ్చి సుగ్రీవుని రాజ్యభ్రష్టునిజేసి యతనినితనరాజ్యమునుండితరుమగొట్టెను. అతని భార్యను తనపోషణలోనుంచుకొనెను. అప్పటినుండియు నెల్లచోట్లను దిమ్మరుచు, తనభార్యను, రాజ్యమును మరలసంపాదించుకొనుటకై ఉపాయములువెదకుచుండెను. కావున నిప్పుడు రామలక్ష్మణుల సహాయము లభించెను. సుగ్రీవుడువారితో మైత్రిజేసుకొనెను.

( వాలివధ ).

వాలిసుగ్రీవుల యుద్ధము ప్రారంభమయ్యెను. ఆయుద్ధములో రాముడొక చెట్టుమరుగున నిలిచి వాలిపై నొకబాణము

నుబ్రయోగించెను. ఆ బాణము వాలిరొమ్మునఁనాట నతఁడు నేలవ్రాలెను. ఆతఁడుక్రిందఁబడగానె, వ్యాధుఁడొకబాణముఁబ్రయోగించిన దానిచేమృతినొందినహరిణముచెంత వాఁడెంతయాత్రముతోఁబోవునో, యాతీరున రాముఁడాత్రముతో వాలిసన్నిధికేగెను. అప్పుడురామునిగాంచి వాలి "ఓరీ! నీవురాజకులమునబుట్టితివి, కాని, రాజధర్మములింకనునీవెఱుఁగవు! నేను నీకొనరించినయపరాధమేమి? నాకింతటిశిక్ష యొసఁగ నేమికారణము? అన్నదమ్ములమగు మాయిరువురిపోట్లాటలో నీవుప్రవేశించుటకేమికారణము?" అనియడిగెను. అందుకు రాముఁడు "భూమిపై పాపులసంఖ్యయధికమైనది. భూమికివారివలన నెక్కువభారమగుచున్నది. కావున దుష్టులను దగురీతినిదండించుటరాజధర్మము కాదా? అపరాధునిదండించుట రాజధర్మముకాదా? కావున నాధర్మము నేనొనరించితిని. నీవేమియు నపరాధముచేయనే లేదా? సుగ్రీవుని రాజ్యమునుండి వెడలఁగొట్టియతనిభార్యను నీవశమునకుం దెచ్చుకొనుట నీదితప్పుకాదా? అందువలననె దుర్మార్గుఁడవగు నీకీదండనవిధించితిని" అని ప్రత్యుత్తరమొసగెను. తనయపరాధము జ్ఞాపకమునకువచ్చినంతనె వాలి కడుదుఃఖించి తనకుమారుఁడగు అంగదునిబిలిచి సుగ్రీవునికాళ్లపైఁబడుమనిచెప్పి సుగ్రీవునితో "తమ్ముఁడా! నీవేయీతనికిదండ్రివైపోషింపుము. నీవుకన్నపుత్రునిబలె వీనినరయుము." అనిదుఃఖముతో వేడెను. అందుకుసుగ్రీవుఁడు కన్నీటి

తో నంగీకరించెను. వాలి కుమారునితో "హామ్మా! నిన్నత డు తనకుమారునివలెజూచుకొనును" అనిచెప్పి యతనిని సుగ్రీవునకొప్పగించి ప్రాణమువిడిచెను.

( సీ త ను శో ధిం చు ట ).

మొదటఏర్పాటుచేసుకొన్నతెఱగున రాముడు వాలిని వధించి సుగ్రీవునకురాజ్యపట్టాభిషేకముచేసెను. అనంతరము సుగ్రీవుడు సీతను వెదకుటకై నలుదిక్కులకును హనుమంతుడు(ఇతనికి ఆంజనేయుడు, మారుతి అనికూడ పేరులుగలవు). నలుడు నీలుడు, మొదలుగాగలవానరులనుపంపెను. సీతను వెదకి ఒక్కనెలలోపల రావలెనని వారినాజ్ఞాపించెను. ఈవానరసైన్యమునకు హనుమంతుడు ముఖ్యనాయకుడైయుండెను. కావున అతనినిబిలిచి రాముడు తనవ్రేలియందుండిన యుంగరమును దీసి, యాసీతకానవాలుగనిమ్మనియిచ్చెను. ఆయుంగరమును దీసికొని హనుమంతుడు అంగదుడు మొదలైన వానరవీరులు దక్షిణదిక్కునకేగిరి. తక్కినయితరవానరులు ఇతరదిక్కులనుబట్టిపోయిరి. నెలపూర్తికాగానె అందఱును అనేక దేశములు తిరిగి తిరిగి వ్యర్థముగమరలివచ్చిరి. కాని, హనుమంతునిపరివారముమాత్రము రాలేదు. సీతను నేటికి యామెజాడ కనుగొన్ననేగాని రామునకుముఖముచూపకూడదను ఉద్దేశముతో వీరు వెడలియుండిరి. అటుపోనగాబోవగా జటాయుతమ్ముడగు సంపాతి వీరిసిసముద్రతీరమునగలిసెను. అతడు ఈవానరు

లతో రావణుడు సీతను సముద్రముదాటించి లంకకుదీసికొని పోయినాడనిచెప్పెను. ఆమాటవినినంతనె సముద్రమునుదాటి లంకకుబోవలెనని వారు యోజించుచుండిరి. కాని, యింత పెద్దసముద్రము నెట్లుదాటవచ్చును? అప్పుడువానరులందఱు నిరాశులై యొకరిముగమునొకరుచూచుచు ఏమియుదోచక కూర్చుండియుండిరి. ఇంతలో హనుమంతుడు "మీరువిచారపడకుడు. ఈసముద్రమును నేను నిమిషమాత్రమునదాటి సీత యెచ్చటనున్నదియుజూచివచ్చెదను" అనిచెప్పి ఒక్కలి వెడల్పుగానున్న యీ సముద్రమునుదాటిపోయెను. అక్కడ ఎందెందు వెదకినను ఆమెకనబడలేదు. తుదకు అతికష్టప్రయాసములకోర్చి ప్రతిచోటను వెదకగా వెదకగా అశోకవనమున ఒకచెట్టునీడనుకూర్చుండియున్న సీత యాతనికిగనబడెను.

## 5. సుందరకాండము.

(ఈకాండమున లంకలో హనుమంతునకును సీతకును ప్రథమసందర్శనముజరిగిన సుందరమగువృత్తాంతము నుడివి యున్నందున ఈకాండమునకు "సుందరకాండము" అని పేరు కలిగెను).



అశోకవనమున సీతాదేవిని రావణాసురుని సేవకులు రావణుని పెండ్లియాడుమని బలవంతపెట్టుట.

(లంకను కాల్చుట).

సీత తనకులోబడనలేనని రావణుడామె ననేకవిధముల బాధపెట్టెను. మంచిమాటలుచెప్పిచూచెను; గాని యామె లోబడదయ్యెను. అందుకుగోపించి రావణుడు రాక్షసస్త్రీలను బిలిచి సీతకు బోధింపుడని ఆజ్ఞాపించెను. వారునామెకు కావలి కాచుచు, ఎన్నిరీతులకష్టపెట్టినను ఆమెయెంతమాత్రము జలింపదయ్యెను. అప్పుడు రావణుడు సీతతో "నీకొక్కసంవత్సరము గడువిచ్చితిని; ఈసంవత్సరములోపల నీవు నాకు లోబడక పోయితివా, నిన్ను జంపివేయుదును" అని బెదరించెను. అప్పటికిపది నెలలుగడచిపోయియుండెను. ఇక రెండు నెలలు మాత్రము గడువున్నది. సీత పలుమారు రాముని దలచితలచి దుఃఖించుచుండెను. నిద్రాహారములు లేకుండెను. ఇట్టిసమయమున ఆకస్మికముగా హనుమంతుడామెచెంతకేగి రాముని సంగతియుంగరమామెకుజూపి "రామలక్ష్మణులు సుఖముగనున్నారు. శీఘ్రముగనిక్కడికరుదెంచి నిన్నుదీసికొనిపోగలరు" అనిచెప్పి యామెనూరార్చెను. అప్పుడామె కెంతసంతోషమయియుండును! ఆమె హనుమంతునితో "నీవువేగమరిగి వారినిదోడితెమ్ము; పొమ్ము" అని సెలవొసంగిపంపెను. అతడుమరలిపోవుచు అశోకవనములోని చెట్లనుబెరికివేసి, అందమైనమేడలను మిద్దెలను, భవనములను నాశముచేసెను. ఇతడిట్లుచేయుచుండగా కొందరురాక్షసులుచూచి, ఇతనిమీ

దికి యుద్ధమునకువచ్చిరి. యుద్ధములో హనుమంతుడు రాక్షసులను గొందఱినిజంపివేసెను. ఒక కోతి రాక్షసులనుజంపుచున్నదని రావణునితో నెవరో చెప్పిరి. అప్పుడు రావణుడతి కోపముతో హనుమంతునివధించుటకై తనకుమారులలో అక్షుని, ఇంద్రజిత్తునుబంపెను. అక్షుని హనుమంతుడు నాశముచేసెను. తానే ఇంద్రజిత్తునిచేతబట్టువడెను. అప్పుడు రాక్షసులందఱుగూడి యితనికాలు జేతులుకట్టి రావణునిసముఖమునకు దీసికొనిపోయిరి. ఈ కోతిని జంపుడని రావణుడాజ్ఞనొసగెను. కాని, రావణునితమ్ముడగు విభీషణుడు అన్నను వారించి "అన్నా! ఇతడు రాయబారిగవచ్చియున్నవాడు. రాయబారినిజంపుటధర్మముకాదు" అనియనెను. ఇందునకు రావణుడు సమ్మతించెను, గాని, యితడుతనపట్టణమును, వనమును నాశముచేసినందున, ఏదేనిశిక్షయొనగింపవలెననియెంచి, ఇతనితోకకు గుడ్డలుచుంటికట్టి, నూనెలోముంచి, దానికి నిప్పంటించుపుడని యాజ్ఞాపించెను. అట్లుచేసిరి. హనుమంతుడు కాలుచున్నతోకతో పైకెగిరి, ఒకయింటిమీదవ్రాలెను. ఆయిల్లు కాలదొడగెను. అక్కడనుండి యింకొకమేడమీదికివ్రాలెను. ఆమేడయు దహింపబొడగెను. అదిచూచి మఱొక్క భవనముమీదికి దుమికెను. ఆభవనమురగులుకొనెను. ఈవిధముగా నాలంకలోనున్న మేడలు భవనములనన్నిటినికాల్చుచు, లంకను భస్మముగా జేసి ఒక్కమొగులుఁన సము

ద్రమునుదాటి, తనతోడికాంచున్న చోటికివచ్చిచేరెను. పిదప దండులునుగలిసి రామునిదగ్గఱకేగిరి. అటకేగి రామచంద్రుని తో హనుమంతుడు సకలము నెఱింగించి, సీత యానవాలుగనత నిచేతికిచ్చిన మాణిక్యము రామచంద్రునకిచ్చెను. అప్పుడు రాముడుమిగులసంతసించి, సీతను, అతిప్రయాసమునకోర్చి, కనుగొనివచ్చిన మారుతినతిప్రేమతో కౌగిలించెను.

---

# 6. యుద్ధ కాండము.

(రావణునితో యుద్ధముచేసి రాముడు వానినిజయించినకథ యీకాండమున చెప్పబడి యుండుటవలన, ఈ కాండమునకు "యుద్ధకాండము" అని పేరుపెట్టబడినది).

హనుమంతుడు చెప్పిన వృత్తాంతమెల్లయునువిని రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, వానరసైన్యసమేతులై సీతను లంకనుండి తెచ్చుటకై బయలుదేరిసముద్రతీరమునకువచ్చిచేరిరి. కాని, ఇంతవిస్తీర్ణమగు సముద్రమునుదాటుటకుమార్గమేది?

## (విభీషణునితో మైత్రి).

లంకలో రావణుడుకూడ యుద్ధప్రయత్నములుచేయు చుండెను. రాముడు కేవలము మనుష్యమాత్రుడు; అందున

ను అజ్ఞానబాలకుడు' అతనిదేమిలెక్క? అతిసులభముగా నతనిని గెలువవచ్చును; అని యనుకొని రావణుడు నిర్భయముతో నుండెను. కాని, విభీషణునకుమాత్ర మావిధముగాతోచుచుండలేదు. అతడు శుద్ధమానసుడును, పవిత్రవర్తనుడును, సుస్వభావుడునునై యుండెను. సీతనుసురలరామునకొప్పజెప్పవలెనని యతడనేకపర్యాయములు రావణునితో నొక్కి నొక్కి చెప్పిచూచెను. కాని, పాపమతనిమాటలటుయుంచు లక్ష్యముంచినవారెవరు? తుదకతడు విసిగి, యెవరిపాపమువారినే నశింపజేయునని రావణునిపక్షమునవలంబింపక రాముకడకువచ్చెను. కాని సుగ్రీవునకుమాత్రమతనియందు విశ్వాసముకలుగదయ్యెను. రావణుడతనినిగపటబుద్ధితో నిక్కడియుదంతములన్నియు తెలిసికొనవచ్చుటకై పంపియుండవచ్చునని శంకించెను. కాని, రామచంద్రు డుదారమానసుడైయుండి "ఎవడైననేమి యెట్టిబుద్ధితో వచ్చిననేమి? మన శరణుజొచ్చినయతడు ముఖ్యముగా రక్షింపబడవలసినదే" అని చెప్పి విభీషణుని సత్కరించి, యతనిని దనసమీపముననె యుంచుకొని లంకారాజ్యమున కతనికి పట్టముకట్టుటకొప్పుకొనెను.

రాముని సైన్యమంతయు సముద్రతీరమునకు వచ్చి, ఈ సముద్రము నేవిధముగా దాటవలనునని యాలోచించుచుండిరని మేము చెప్పియుంటిమికదా! ఇప్పుడు విభీషణుడు వీరికుపాయముచెప్పెను. అతడుచెప్పినప్రకారము విశ్వకర్మపుత్రుడగు

నలునిబిలిపించి యాసముద్రమునకు వంతెనకట్టించిరి. ఆవం తెన అతిశీఘ్రకాలములోనె సిద్ధమయ్యెను. ఆవంతెనమీదు గ నావానరసైన్యముతో రాముడు సముద్రమునకావలనున్న సువేలాచల మను పర్వతముపై వచ్చిచేరెను.

వానరసైన్యము సముద్రముదాటివచ్చిన సంగతి రావణునకు తెలిసి యతడు శుకుడు, సారణుడు అను ఇరువురు దూతలనుపిలిచి శత్రుసైన్యము విషయమై అన్నియు తెలిసికొని రండనిపంపెను. దూతలిరువురును దూరమునుండి యాసైన్యమునుజూచి తిరిగిపోయి రావణునితో "ప్రభువా! వానర సైన్యమెంత ఉన్నదని చెప్పగలము? కొంచమా? లెక్కపెట్ట వీలా? అనేకకోట్లుండవచ్చును. సైన్యము చాలయున్నది. చూడగా మనమీవానరులతో పోరి జయముపొందుదుమని మాకుతోచ లేదు. కావున, మనమిప్పుడు యుద్ధముమానుట యెఉత్తమము: మాయభిప్రాయమేమనగా సీతనుడిసికొనిపోయి రామునకొప్పజెసి, యతనితో మైత్రిజేసికొనుటయే శ్రేయము" అనినుడివిరి. రావణునిరాణియగు మండోదరియు నీవిధముగానచెప్పెను. కాని రావణుడెవరిమాటలును, ఎవరియు పదేశములును, వినడయ్యెను. ఎవరేమిచేయగలరు? తరువాత రావణుడు రామునిశిరసుమాదిరిగనె యొకశిరసుమట్టితోచేయించి, యతని ధనుస్సువంటి ధనుస్సుచేయించి, వానిని సీత యొద్దకంపి "మేము రామునిజంపినారము. అతనిశిరప్రాణ

ములో లేదు. ఇకనైన నీవు మాకులోబడుదువా, లేదా?" అని బెదరించియడిగించెను. కాని, యామె యిట్టిబెదరింపుల కును మాయలకును, మోసపోయి తనకులమును శీలమును జెఱచుకొనునంతటి మూర్ఖస్త్రీ కాదు. అందునకును ఆమె లోబడలేదు. కాని, భర్తశిరసునుజూచి మనసుకలవరపడి శోకింపజొచ్చెను. ఇంతలో విభీషణునిభార్య సరమ ఆమెనూదార్చి, యిదికపటకృత్యముకాని నిశ్చయముకాదు; రామ లక్ష్మణులు సుఖముగానున్నవారు, అనిధైర్యము కలిగించు పలుకులాడుచుండెను. అప్పుడు సీత నెమ్మదించెను. ఇంకరావణుడేమిచేయగలడు? ఈయుపాయమువలననైన ఆమెలొంగునేమోయనితలచెను. ఇదియువ్యర్థమయ్యెను. వేఱుఉపాయములేకపోయెను. ఇంకసైన్యమునంతయు జక్కపఱచుకొని శత్రువుల నెదురించుటకు సిద్ధపడెను.

( యు ద్ధ ప్రా రం భ ము ).

యుద్ధముచేయకుండనె మంచిమాటలతో కార్యము నెఱవేరిన మంచిదనితలచి రాముడు అంగదుని రావణునిదగ్గఱ కంపెను. అంగదుడు రాయబారిగపోయి రావణునకు మంచిమాటలతోనె రాముని సందేశముదెలిపి "సీతను రామచంద్రునకర్పింపుము. సఖ్యపడుము. వ్యర్థముగనీసైన్యమునకు, నీప్రజలకు, నీబంధువులకు నాయాసము కలిగింపకుము. నీవు నుజెడకుము" అని హితోపదేశముజేసెను. కాని, రావణుడా

తని మాటలువినడయ్యెను. అంతయేగాక రాక్షసు లంగదుని జంపుటకాలోచించిరి. వారియుద్యమము అంగదుడెఱిగి మెల్ల గతప్పించుకొనిపోయి తనవానరసైన్యమును వెంటదీసికొని మరలపోయి రాక్షసులనుదాకెను. అంతట యుద్ధము ప్రారంభమయ్యెను. రావణుని కుమారుడగు ఇంద్రజిత్తు ఈయుద్ధములోదనకుగల నేర్పరితనమంతయును వినియోగించెను. అతడు రామలక్ష్మణులను మూర్ఛపడజేసెను. హనుమంతుడు, అంగదుడు జాంబవంతుడు అను మొదలుగాగల వానరవీరుల కు గాయములుకలుగజేసెను. రామలక్ష్మణులు మూర్ఛిల్లినేలబడగానె వీరిరువురును జచ్చిరనితలచి ఆఇంద్రజిత్తు మహాసంభ్రమముతో మగిడి తనరాజధానికేగెను. శత్రువుచచ్చెనని తెలిసినంతనె రావణుడు మిగులసంతసించెను. తక్షణ మతడు పుష్పవిమానమున సీతనెక్కించుకొని రామలక్ష్మణులు పడియుండుటనామెకు జూపించెను. సీతాదేవి దుఃఖముతోనేడ్వదొడగెను. పిదప గొంతసేపటికి వారిరువురును జావక మూర్ఛిల్లియుండిరని తెలిసికొని యామెదుఃఖమునాపుకొనెను.

రామలక్ష్మణులు పేదదేరి మెల్లగలేచి మరల యుద్ధమునకు మొదలిడిరి. రామలక్ష్మణులు లేచిరని తెలిసినంత రావణుడు మిగులవిచారమునొందెను. అతడు ధూమ్రాక్షుడు, వజ్రదంష్ట్రుడు, అకంపనుడు ప్రహస్తుడు అను నలువురు మహావీరులను యుద్ధముచేయుటకుబంపెను. వానరులు వీరిని

కూడ లక్ష్యము సేయక యుద్ధముచేసిచంపిరి. అనంతరము ఇంద్రజిత్తు నికుంభుడు, అనువీరాగ్రేసరులను, ఇతర మహాయోధులను తనవెంబడిదీసికొని రావణుడు స్వయముగా యుద్ధభూమికివచ్చిచేరెను. తన యుద్ధకౌశలమంతయు ప్రకటించి రావణుడు సుగ్రీవుని మూర్ఛిల్లజేసెను. హనుమంతుని నొప్పించెను; నలుని సగము ప్రాణములతోవిడిచిపెట్టెను. ఇట్టి విపరీత ప్రసంగముగని లక్ష్మణుడు రావణునితోబోరుటకు సిద్ధపడెను. చాలసేపువరకు యుద్ధముచేయుగా రావణుడాతని నిగూడ ఒకదివ్యశక్తివలన మూర్ఛితునిగావించెను. లక్ష్మణుడు నేలవ్రాలెను. వెంటనె రావణుడాతని నీడ్చుకొనిపోవుటకుబ్రయత్నించెను. ఇంతలో హనుమంతు డడ్డమువచ్చి రావణునినొప్పించి, లక్ష్మణునతనివశమునుండి విడిపించుకొని, యాపంపులోనుండి తప్పించుకొని పారిపోయెను. రాముడు రావణునితోబోరి రావణుని రథము విరుగగొట్టెను. గుఱ్ఱములనుజంపెను; సారథిని గాయములచే విడిచెను. ఇంతయే కాదు. రావణుని ఱొమ్మున నొక్కబాణము గ్రుచ్చునట్లు చేసెను. ఱొమ్ములోబాణము నాటియున్నను రావణుడు చావలేదు. ఇట్టిదుస్థితిలో రావణుడు తనసగరున కరిగి కుంభకర్ణునకై వార్త పంపెను.

( కుంభకర్ణుని మరణము ).

రావణునితమ్ముడగు కుంభకర్ణుడు అతిశయనిద్రాసక్తుడు.

లంకలో నింత ఘోరముగ ఇప్పుడు సంగ్రామముజరుగుచుండిన ను అతడు నిద్దురపోవుచునేయుండెను. రణముజరుగుచున్నదని యతనికి దెలియనే తెలియదు. ఆతనిని నిద్రనుండిమేల్కొల్పవలెనని రాక్షసులందఱు నతనిచెవులదగ్గఱ మహాభయంకరముగా భేరీలు నగారాలువాయించిరి. అప్పుడొక్కింత మేల్కొని, లేచినవెంటనె యాకలికాగా రాక్షసులు తెచ్చిన ఆహారపదార్థములనుసేవించి, పిదప నేమి యుదంతములనియడిగెను. రాక్షసులెల్లసంగతులను నివేదించిరి. అందునకుజింతించి, యన్నయగురావణునిదగ్గఱకరిగి యతనితో "అన్యాయముగా సీతను దెచ్చి యిట్టివినాశకాలము తెచ్చుకొంటివికదా! ఇప్పుడేమి చేయవచ్చును? అయినదేమొఅయినది. ఇప్పుడు వెనుదీయరాదు!" అనియని, యుద్ధమునకుబోవునప్పుడు ధరించువస్త్రములను ధరించుకొని, చేతశస్త్రముగొని వానరసైన్యముమీదికి యుద్ధమునకుబోయెను. భీకరముగ సంగ్రామముజేయుచు హనుమంతుని, అంగదుని ననేకబాణములచేనొప్పించి, వారికి దేహమెల్లగాయములుజేసి, సుగ్రీవుని బాణములతో బట్టుకొని లంకకు నీడ్చుకొనిపోవబయలుదేరెను. కాని, సుగ్రీవుడొకయుక్తి చేసి కుంభకర్ణునివశమునుండి తప్పించుకొనెను. అటుతప్పించుకొనిపోవుచు కుంభకర్ణుని ముక్కును జెవులును గోసివేసి వెడలిపోయెను. కుంభకర్ణునకందువలన గోపమెక్కువకాగా మునుపటికన్న నెక్కుడుకోపముతో రణమొనరింపసాగెను. మొట్ట

మొదట లక్ష్మణునితోడను, పిదప రామునితోడను అతడు పో రెను. పాపము! యుద్ధముచేయుచుండగా రామునిచేజంపబడె ను. ఇతడుచావగా మహోదరుడు, నరాంతకుడు, అతికాయు డు ( రావణునికొడుకు ) మొదలగు రాక్షసయోధులువచ్చి యుద్ధముచేసిరి. లక్ష్మణుడొక్కడే వీరినందఱిని యమునిమంది రమున కతిథులగబంపివేసెను.

(లక్ష్మణునకును ఇంద్రజిత్తునకును యుద్ధము).

రావణునివీరులలో ననేకవీరాగ్రేసరులు యుద్ధమున ని హతులౌటగని ఇంద్రజిత్తు మహోగ్రుడై భీకరముగ సంగ్రామ మొనరించుచు హనుమంతుని, అంగదుని, జాంబవంతుని నిశ్చే ష్టితులజేసెను. ఇంద్రజిత్తునిశౌర్యముగని రామలక్ష్మణులు తా మును నిశ్చేష్టులైనట్లుపడిరి. ఇంద్రజిత్తుఎవరికినిగనబడక అదృ శ్యరూపమున యుద్ధముచేయుచుండెను. రామునివైపుననున్న వీరులందఱును జచ్చిరనితలచి మహాఆనందముతో సుగ్రీవుడు మగిడిపోయెను. తరువాత హనుమంతుడును విభీషణుడును తమ సేనలో నెవ్వరెవ్వరుచచ్చిరో, యింకనెందఱు మిగిలియున్నవా రోయని చూచుచుండిరి. జాంబవంతుడుగాయములతోబడి యుండుటచూచిరి. హనుమంతుడతనిని బాగుపఱచును ద్దేశము తో వనౌషధులనుదెచ్చుటకై మహోదయపర్వతమునకేగెను. అట నెన్నియో యౌషధులుండెను. అందేదియుగుర్తింపలేక ఆపర్వతశిఖరము ఓషధులతోకూడ పెల్లగించితెచ్చి జాంబవం

తుని గాయములను బాగుపఱచి తక్కినవానరులను బాగుపఱచి మరలనాపర్వతశిఖరమును యథాస్థలముననుంచివచ్చెను. ఈవిధముగాహనుమంతునివలన పునర్జీవితులైనవానరవీరులతో హనుమంతుడు లంకనంతయును అల్లకల్లోలముచేయసాగెను. అప్పుడింద్రజిత్తు అతనినిజంపవలెనని విజయరథముసంపాదించుటకై హోమముచేయుటకుబ్రారంభించెను. ఈహోమముపూర్తియైయుండిన ఇంద్రజిత్తునుగెలుచువారెవ్వరునుండియుండరు. కావున విభీషణుడు రామునితోనివృత్తాంతముచెప్పియాహోమమున కాటంకములుగల్పింపుమనెను. రాముడాపనికై లక్ష్మణుని నియోగించెను. లక్ష్మణుడాంజనేయుని (హనుమంతుని) భుజముపైనెక్కిపోయి ఇంద్రజిత్తుచేయుచున్న హోమమునకాటంకములుగల్పించెను. అందువలన నత్యుగ్రుడైమండిపడి ఇంద్రజిత్తు హోమమునుజాలించి లక్ష్మణునిపైకిదూకెను. ఇరువురకును మహాఘోరమైన రణముజరిగెను. ఇందిరువురు నొకరికొకరు తీసిపోవువారుకారు. ఇందెవరుగెలుతురా యని యిరుపైపుల సైనికులును ఆశ్చర్య సంభ్రమములతోడను, భీతితోడను, చూచుచుండిరి. తుదకు ఇంద్రజిత్తు లక్ష్మణుని శస్త్రములకు బలియయ్యెను. ఇంద్రజిత్తుచచ్చిక్రిందపడెను.

( రా వ ణ వ ధ ).

మేఘనాథుడు (ఇంద్రజిత్తునిమఱియొకపేరు)మడసెనని తెలిసినంతనె రావణుడుదుఃఖింపదొడగెను. అంతయేగాక మ

హావీరాధివీరులును ఈయుద్ధమున నిహతులై యుండిరి. రావ
ణునిసైన్యమున చాలమట్టుకుతగ్గియుండెను. తనయోధవరుల
నుజంపినవారిని నాశముచేసినగాని మగిడితనముఖమూరజూప
కూడదని రావణుడునిశ్చయించుకొనెను. మహాబలవంతులగు
సోదరులును, కుమారులును, ఇతరవీరులునుచచ్చినప్పుడతనిమ
నసెంతబాధించుచుండునో యోజింపుడు! ఆతడట్టినిశ్చయము
చేయకెట్లుండగలడు? అటునిశ్చయించుకొని మిగిలియున్నసేన
నన్నిటినివెంటబెట్టుకొని రావణుడుస్వయముగ రణరంగమునకు
వచ్చిచేరెను. యుద్ధముప్రారంభమయ్యెను. సీత తనకులోబడ
లేదనుకోపము; వానరులచే తనబలమంతయుజంపబడుట యొ
క్కకోపము; మేఘనాధునిబోలిన మహాయోధవరులుచంపబ
డుటయొకకోపము; సోదరులుమరణించిరని యొకకోపము; ఇట్ల
న్నివిధములకోపము, దుఃఖముకలిసి యతనిని వెఱ్ఱివానిజేసెను.
ఆతనికోపాగ్నికి దుఃఖవాయువుతోడుపడెను. అంతట రాము
నిపై పరంపరలుగశరములువేయసాగెను. వెంటవెంటనెబాణ
ములనుప్రయోగింపసాగెను. ఇతనిధాటిగని వానరవీరులందఱు
ఛతిల్లిరి. రావణుడుప్రయోగించినశక్తులలోనొక్కటి లక్ష్మణున
కుదగిలెను. వెంటనెలక్ష్మణుడుమూర్ఛిల్లి నేలకొఱిగెను. అప్పు
డు తమ్ముడుచచ్చెననుకొని రాముడాక్రోశింపదొడగెను. అహా!
సోదరున్నేని ప్రేమ! రాముని బిచ్చివానిజేసివేసెను. అంతట
వానర వీరులలో సుషేణుడను నతడొకడుండెను. అతడు

వైద్యుడు. ఆతని యాలోచనమేరకు హనుమంతుడు మహోదయ పర్వతమునకేగి యొక యోషధిదెచ్చెను. ఆయోషధీ సహాయమున లక్ష్మణుడు మూర్ఛనుండి లేచెను. ఇప్పుడు రామ రావణుల యుద్ధము మునుపటికన్న నెక్కుడు ఘోరముగ జరుగుచుండెను. ఏడుదినములవరకును భూమియు నాకాశము బాణములతో నిండుచుండెను. వేనవేల పీనులుమడిసిరి. రెండు వైపులవారి సైనికులును మరణించుచుండిరి. భూమి పైరక్తము యేరయి పారుచుండెను. తుదకు రాముడొక్క బాణముచే రావణుని అంతమొనరించెను. సకల దేవతలును, ఋషులును, సాధుసంతతులును ఆనందించిరి. దేవతలు రామునిపై పుష్పవర్షములు గురిపించిరి. ఋషులును సాధుజనులును రాముని బలుతెఱగుల దీవించిరి. లోకము నిష్కంటకమయ్యెను. రాక్షస బాధలడగెను.

( సీ తా స ం ద ర్శ న ము ).

రావణుని మరణానంతరము రామునాజ్ఞమేరకు విభీషణుడు లంకాధిపతియై రాజ్యమేలసాగెను. సీత నశోకవనము నుండి రప్పించి విభీషణు డామెను మంగళస్నానముచేయించి వస్త్రాలంకార విభూషితురాలినిజేసి యామెను రాముని సన్నిధికి దెచ్చివిడిచెను. ఆమెను గాంచినంతనె రాముని మనసున సంతోషము నిండెను. నిశ్చయముగా సీత శుద్ధురాలును, నిష్కళంకురాలునై యుండెను; గాని యామె చాలకాలము వరకు

దుష్టులగు రాక్షసుల యింటనుండినందున ఆమెను పవిత్రురాలి
నిగా జేయక అట్టులనె యింటికిదెచ్చిన లోకాపవాదములకు
బాలు కావలసివచ్చును, అని తలచి, యామె పవిత్రత యెల్ల
వారికిని దెలియజేసెను. అనంతర మామెతోగలసి పుష్పక
విమానమునగూర్చుండి రామ లక్ష్మణు లయోధ్యకు బోయి
రి. పోవుచు త్రోవలోగల స్థలములనన్నిటిని సీతకు జూపుచు,
ఆయాస్థలములందలి విశేషములెల్లయుజెప్పుచు, తా నెచ్చటె
చట నుండినది, అచ్చటనేమిచేసినది, మొదలుగాగల తమ
యరణ్యావాసమున ఘటించినవన్నిటిని ఆమెకు దెలిపెను. అ
యోధ్య యింకకొంచెము దూరమున నున్నదనగా రాముడు
తానువచ్చుచున్న వార్తను భరతునకు దెలుపుమని ముం
దుగ హనుమంతుని బంపెను. హనుమంతుడు ముందేగి భర
తునితో రాముడు వచ్చుచున్నాడని చెప్పెను. అప్పుడు భరతున
కు గలిగిన యానందమునకు మేరయే లేకపోయెను. అతని
యానందమును వర్ణించుటకలవిగాకుండెను. వచ్చుచున్న అన్న
గారిని తగురీతిని సత్కరించుటకు దగినయేర్పాటులన్నియు జే
యించెను. కొంతసేపటికి రామ లక్ష్మణులు వచ్చిరి. ఇంట
కౌసల్య, సుమిత్ర, కైకయి మొదలగుతల్లులను, భరత శత్రు
ఘ్నులను గురువశిష్ఠులను సందర్శించిరి. ప్రేమమీర గాగి
లించిరి. అనంతరము భోజనము ముగిసినతరువాత అడవులలో
దామేమిచేసినదియు నెట్లుకాలముగడపినదియు- మొదలగు సీ వ

దునాగ్లేంద్లు జరిగినవృత్తాంతములు రామ లక్ష్మణు లందఱికిని జెప్పిరి. ఏడేట్లయినను గడపటశుభమే కలిగినందునకును, సీతా సమేతులై రామ లక్ష్మణులు మరలి యయోధ్యకు సుఖముగ వచ్చి చేరినందునకును అందఱు నానందించిరి. భరతు డన్న గారి యెదుట జేతులు జోడించుకొని నిలిచి "మీరాజ్యమును మీరేలుడు" అని ప్రార్థించెను. రాముడతని నాలింగనమొన ర్చుకొనెను. వశిష్ఠుల ఆజ్ఞమేఱకు భరతుని విన్నపమునకు రాముడంగీకరించెను. రామునకు మహావైభవముతో బట్టా భిషేకముచేసిరి. పరాక్రమవంతుడును, ధైర్యశాలియు, ప్రజల బిడ్డలవలె బాలించునట్టియు, సద్గుణుడును నైన రామ భూపా లుడు తమకు భూపాలుడయినందున కయోధ్యా నగరవాసులం దఱును మిగుల నానందించిరి.

# 7. ఉత్తర కాండము.

(రామచంద్రుని చరిత్రమున ఉత్తరార్థ మిక్కడనుండి ప్రా రంభించినందున ఈ కాండమునకు "ఉత్తరకాండము" అని పేరు పెట్టబడెను).

## ( సీత నరణ్యమున విడుచుట ).

రాముడు తల్లులతోడను, సోదరులతోడను, భార్య తోడను, మిత్రులతోడను సుఖముగ గాలముగడుపుచు, రాజ్య

మును బాలించుచు ప్రజల కష్టసుఖములను విచారించి రాజ్యమును రీతిని జరుపుచునుండెను. ఈవిధముగా కొంత కాలము సుఖముగా గడచెను. కాని, పాపము, సీతకుమాత్రము మరల కష్టము సంభవించెను. ఆమెనొసట కష్టములననుభవింపుమని వ్రాసియుండబోలును! రాజ్యమునగల ప్రజల కష్ట సుఖములను గనుగొనుటకై గూఢచారులను నియమించుట రాజులకు ధర్మమై యుండెను. ఈ గూఢచారులు మాఱువేసములతోడను, పొంచి వినుటవలనను, ప్రజల కష్ట సుఖములు తెలిసికొనుచు రాజుల కావృత్తాంతము దెలుపుచుందురు. ఆ యలవాటు చొప్పున రాముడును గూఢచారులను గొందఱ నేర్పరచి యుండెను. వారు రాముని రాజ్యమున అన్నివైపులను సంచరించుచు, యావద్వృత్తాంతము రామ భూపాలునకు దెలుపుచుందురు. ఒకనాడొకచారుడేతెంచి "స్వామీ! తమరాజ్యమున బ్రజలెల్లరును దమ్ము వేనోళ్ల బొగడుచున్నారు. కన్నుల నిండుగ నిద్రపోవుచున్నారు. ఎవరివలనను ఏవిధమగు కష్టమును ప్రజలకు గలుగకున్నది. తమ నీతికిని, తమ యౌదార్య గుణమునకును, తమ న్యాయాచరణమునకును, తమకు బ్రజల యెడగల వాత్సల్యమును అందఱు సంతసించుచునే యున్నారు. కాని, దేవా'—" అని యింతటితో నిలిపి భయపడుచు ఏమియుజెప్పలేక యూరకుండెను. అతడు ఏమోచెప్పుటకు భయపడుచున్నవాడని తెలిసికొని రామచంద్రుడు "కాని"

అని యేమో చెప్పబోవుచు అంతట నిలిపితివేల? భయపడకుము: చెప్పుము— ఏమున్నను దాచక చెప్పుము'' అని యోదార్చి యడిగెను.

చారుడు—— స్వామీ! చెప్పుటకు నోరాడకున్నది— చెప్పిననేమో— చెప్పకున్న నేమో యని నాకు భయమగుచున్నది.

రాముడు——భయపడకుము. ప్రజలుఅనుకొనినదానినిగదా నీవు చెప్పుచున్నావు? ఇంక నీకు భయమెందులకు? ఎట్టిదైనను సరియె. చెప్పుము.

చారుడు—— అయినజెప్పెద. కాని, ఒక్కదోషము మీయందారోపించుచున్నారు.

రాముడు—— అదెట్టిది? నాయందేదైన దోషముండిన నిర్భయముగ జెప్పవచ్చును. దానిని సవరించుకొందును. ఆ దోషమేది?

చారుడు—— దేవా! ప్రజ లనుకొనినమాటలు చెప్పుచున్నాను. వినుడు. "దుష్టుడును, నీచుడును అగు రావణునియింట బదినెలలు నివసించిన భార్యను మరల తెచ్చుకొని యేలుట మా(త్రమతనికి దగనిపని'' అని లోకు లనుకొనుచున్నారు.

ఈ మాటవినినంతనె రామునకు దుఃఖమగ్గలమయ్యెను. "అయ్యో! నిష్కారణముగ లోకుల అపవాదములకు పాలైతిని గదా! సీత నిష్కళంకురాలని చక్కగనెఱిగియే యామెను మరల చేబట్టితిని. అయినను, లోకుల కేమి తెలియును? ఇంక

ముందు ప్రజలు నన్నే నిదర్శనముగా గొందురు. అప్పుడనర్థము లు మూడును. ఇప్పుడేమిచేయవచ్చును?'' అని యోజించి, తమ్ములతో నాలోచించి, వారి యభిప్రాయములకు, మతమునకు, విరుద్ధముగ రాముడామెను అరణ్యమున నొంటిగా విడిచిపెట్టుటకు నిశ్చయించెను. ఆమె నరణ్యమున డించివచ్చుట కెవరొప్పుదురు? ఎంతయో కోపించినపిదప, అన్నయాజ్ఞను— అందునను రాజునానతిని- మీరరాదనియెంచి, యతిదుఃఖముతో లక్ష్మణుడా ఘోరకార్యమున కొప్పుకొనెను. పాపము! సీత నిండుగర్భిణి.

అన్నయాజ్ఞమేరకు లక్ష్మణుడు సీతతో రథమునెక్కి- యరణ్యమున వాల్మీకి ఋషియొక్క- యాశ్రమము చెంతకుపోయి, యామె నక్కడవిడిచి తానింటికి మరలివచ్చెను. లక్ష్మణు డామెను విడువలేక విడువలేక, రామాజ్ఞనుదెలిపి అతిదుఃఖముతో యింటికేగినపిదప, సీత తన దౌర్భాగ్యమును అదృష్టమును దూషించుకొనుచు, పెద్దపెట్టున రోదింపదొడగెను. భర్తయొక్క- పాదసేవలకుదూరమై, బంధువులకుదూరమై, ఆప్తజనులకుదూరమై, ఒంటియై, భీకరారణ్యమున విడువబడిన కాంతకు భీతికలుగకుండునా! ఆమె యెచ్చటకేగగలదు? అట్టియెడ నామెకు దుఃఖముకలుగదా? అప్పుడు పెద్దపెట్టున నేడ్చుటకన్న నింకేమిచేయగలదు? ఆమెరోదన మరణ్యమంతయు నిండిపోయెను.

ఋషికుమారులు కొందఱు స్నానముచేసి, పుష్పఫలాదులను దీసికొని తమతమ యాశ్రమములకు బోవుచుండిరి. వారికీ స్త్రీ యార్తధ్వని వినబడెను. వారామెచెంతకరిగి యామె వృత్తాంతమంతయును దెలిసికొని, ఓదార్చి, తమగురువగు వాల్మీకుల కీయుదంతము నివేదించిరి. అప్పుడు వాల్మీకి మహర్షి స్వయముగ నామెకడకేగి, ఓదార్చి, తమయాశ్రమమునకు బిలుచుకొనిపోయి, యామెను దన బిడ్డభాతిగ పోషించుచుండెను. ఆమెయు, చింతనొక్కింతమాని, తన నాథుని కెప్పుడు తనయెడ దయకలుగునా యనుకొనుచు, మనసున దేవుని నారాధించుచు గాలమొకరీతిగ గడుపుచుండెను.

( కు శ ల వు ల జ న న ము ).

లోకాపవాదమునకు వెఱచి రాముడు సీత నరణ్యమున విడిపించెనుగదా! అప్పుడామె నిండుగర్భిణియని చెప్పియుంటిమి. ఆమె వాల్మీకి ఆశ్రమముననె ఒక శుభలగ్నమున ప్రసవించెను. ఇరువురు కొడుకులుదయించిరి. వాల్మీకి మహర్షి యాబాలకులకు కుశుడు, లవుడు అని పేరులుపెట్టెను. ఈ బాలురిరువురును రూపమున నొకింతయు భేదములేక తండ్రివలెనే యుండిరి. బుద్ధినిగూడ రామునిబోలి యుండిరి. యుక్తవయసు రాగానె వాల్మీకి వీరిరువురకును చదువు నేర్పుచుండెను. బాలురిరువురును బుద్ధికుశలము గలవారగుటచే అనతికాలములోనె విద్యావంతులైరి. అప్పుడానందమంది గురువు తానురచించిన

రామాయణము వారికినేర్పెను. ఆహా! వారి కంఠస్వనమేమని వర్ణింప వచ్చును! ఇరువురును మధుర స్వరమున, రామాయణ మును స్పష్టముగా అర్థమగునటుల బాడుచుండ వినువారి భాగ్యమే భాగ్యము- నిశ్చయముగ చిత్తరుబొమ్మ లౌదురు.

ఈ కుశలవులిరువురును రామాయణమును పాఠముచేసి పాడుచుందురేగాని, వారా రామాయణములోని నాయకుడు తమ తండ్రియని యెఱుగరు. అందు వర్ణింపబడిన చరిత్రమంతయు దమ తండ్రి చరిత్రము లేయని యెఱుగరు. గురువుగారిప్పటివఱకు వారికి చెప్పియుండలేదు.

(రాము డశ్వమేధ యజ్ఞముచేయుట).

ఇట్లుండ నొకనాడు వాల్మీకి మహర్షులు కుశలవులకు రామాయణము పాఠము చెప్పుచుండగా ఒకదూతవచ్చి "స్వామీ! రామచంద్రు డశ్వమేధయజ్ఞము చేయుచున్నారు. తమ్ము దోడ్కొనిరమ్మని, నను బంపియున్నారు" అని యనెను. వాల్మీకి పయనమైపోవుచు కుశలవులను వెంటగొనిచనెను. అక్కడికేగినపిదప ఒక్కనాడు వాల్మీకి ఈ భాలురచే రామాయణము జదివించెను. బాలురును తమ మృదుమధుర స్వరమున బాడ దొడగిరి. రాముడు వీరివంకనె కనుఱెప్పపాటులేవేయక చూచుచుండెను. అతనికి బాలకులయెడ ప్రేమపుట్టెను. ఇంతలో రామాయణము పూర్తియయ్యెను. రామునకు మరల విను నభిలాషకలిగెను. ఆతడు తన యభిలాష తెలుప, బాలు

రు మరల జదువ ప్రారంభించిరి. వారు చదువుచుండగా సభా సదు లెల్లరును వీరి సౌందర్యమునుగని ఆశ్చర్య పడుచుండిరి. ఆ బాలురయందు రాముని స్వరూపముండుట కందఱు ఆశ్చ ర్య పడుచుండిరి. రాముని రూపమునను, ఈ బాలుర రూప మునను లేశమును భేదముండలేదు. ఈ పసికూనలయెడ రా మునకు విశ్వప్రేమ తనంతనె పుట్టెను. తనమనసు నిలుపలేక వాల్మీకి మహర్షితో రాముడీ బాలురెవ్వరని యడిగెను. మహర్షియు నెల్ల వృత్తాంతములును చెప్పెను. అప్పుడు రాము నకైన సంతోషము- అతనికిగలిగిన సౌఖ్యము- మేము వర్ణిం పలేము. అతని కెక్కువ వాత్సల్యముగలిగి బాలకులను కౌ గిలించెను. అప్పుడు రామచంద్రుడు వాల్మీకి మహర్షితో "స్వామీ! అరణ్యమునయందుగా సీత సద్వర్తనము గలిగియుం డెనని మీరు నమ్మకమిచ్చినచో నేనామెను మరలగైకొందును" అని యనెను. వాల్మీకి మహర్షి యామె వర్తనమును గురించి పొగడి, ఆమె నిష్కళంకురాలని చెప్పి, యామెను మరలదెచ్చి రామునికడ విడిచెను. నిండుసభలో ఆమెను గురించియు, ఆమె వర్తనమునుగురించియు మహర్షి వాల్మీకి నమ్మకమిచ్చినను, రాముని మనసుమాత్రము సంకోచించుచుండెను. అప్పుడు రాముడు "సీతయే స్వయముగ తన సద్వర్తనమును గురించి తగిన సమాధానము మొసగినచో బాగుండును" అని యనెను. అప్పుడు సీత రామునకు నమస్కరించి, వినయముతో జేతులు

జోడించుకొని "హా! మాతా! భూదేవీ! నేను మనసునందున గాని, వాక్కునందునగాని, శరీరమునందునగాని, దుష్కృత్యములేవియు జేయకుండినయెడలను, రామభూపాలుని పాదముల యందలి భక్తిని ఏమరకుండినయెడలను నీవు నన్ను నీకడుపున దీసికొనుము" అని యెలుగెత్తి పలికెను. వెంటనె భూమి చీలి, యామెను లోనికి గొనిచనియెను. సీత కనబడక పోయెను.

( యోగి వచ్చుట ).

సీత భూమిలో పడిపోయినయప్పటినుండియు రాముడు చింతించుచు నామెనే తలచుచుండెను. అతని కేమియు దోచదు. రేయింబగ లామెస్వరూప మాతని నేత్రములకు గట్టినట్లుండెను. ఆత డామెయెడ క్రూరముగా ప్రవర్తించినందున అతనిమనసు దహించుకొని పోవుచుండెను. ఒక్కనాడొక్క యోగి రాముని కడకువచ్చి "నేను మీతో మాటలాడవచ్చి యున్నాను. మన మిరువురు నొక్కరహస్య స్థలమునను౦డవలెను. అందెవ్వరును రాగూడదు. అటులెవ్వరైన వచ్చిన దక్షణమె వాని జంపవలెను" అన రాముడందుకొప్పుకొని, లక్ష్మణుని బిలిచి "మేమిరువురము లోపల మాటలాడుచుందుము, నీవు ద్వారముకడనుండి, యెవ్వరువచ్చినను లోనకు రానియకుము. ఎవ్వరైనవచ్చినయెడ తలగొట్టికివేయబడును" అని చెప్పెను. లక్ష్మణుడు ద్వారపాలకుడై యుండెను.

యోగియు రాముడు నేమియో మాటలాడుచుండిరి. అంతట దుర్వాసఋషివచ్చి, లోనకుం బోవజొచ్చెను. లక్ష్మణుడాత ని నడ్డగించి, లోపలికేగ నీయలేదు. దుర్వాసు డతికోపిష్టి. అ తడుకోపించెను. అప్పుడు లక్ష్మణుడు తనలో యోజించెను. "ఇతడు శపించెనా అందఱు నశింపగలరు, కావున నేనొక్కడ నె చచ్చిననేమి? అందఱుజచ్చుటకన్న నేనొక్కడేచచ్చిన మే లగును" అని యెంచి లక్ష్మణుడు లోనకేగి దుర్వాసఋషి వచ్చియున్నాడని చెప్పెను. లక్ష్మణుడు లోనకువచ్చినంత యోగి యతనినిచూచి లేచిపోయెను.

(లక్ష్మణుని అంతము).

యోగికిచ్చిన వచనము భంగమయ్యెగదా అని రాము నకు విచారముకలిగెను. అందునకు లక్ష్మణుడుకదా కారణ ము, కావున, అతనిని అయోధ్యాపురమునుండి పారదోలుము అని వశిష్ఠుడు చెప్పినందున, లక్ష్మణు డన్నయాజ్ఞనుగొని అందఱిసెలవుబొంది బయలుదేరి సరయూనదీతీరమునకు వచ్చి జలప్రవాహమునబడి మునిగిపోయెను. అయ్యెను. లక్ష్మణుని చరిత్రము పూర్తియయ్యెను.

(రామునిచరిత్రమునకు అంతము).

లక్ష్మణుడు సరయూనదీ జలప్రవాహమునబడి మునిగి పోయెనని రామునకు తెలియవచ్చెను. అతడు మిక్కిలి దుఃఖిం చెను. భార్యపోయెను; అనుగు దమ్ముడుపోయెను. ఇంక అత

డెట్లు సుఖముగ రాజ్యపరిపాలనము చేయుచు ఉండగలడు? త మ్మునిపై నతనికున్న ప్రేమ యెట్టిది? అతనికి విరక్తిపుట్టెను; తన ప్రాణము తనకు భారమనితోచెను. అప్పుడు భరతునిబిలిచి రాజ్యమేలుకొమ్మని చెప్పెను. భరతు డందునకంగీకరించ లేదు. అప్పుడయోధ్యను రెండుభాగములుచేసి కుశ లవులకు పట్టాభిషేకముచేసి, మధుపురమునకు రాజుగా నియమింపబడి న శత్రుఘ్నుని బిలిపించెను. శత్రుఘ్ను డయోధ్యకువచ్చెను ఇక్కడ జరిగినవన్నియు నతనికి దెలిసెను. అప్పుడతడును తన యిరువురు కుమారులకు రాజ్యముపంచియిచ్చి, రాముడెక్కడి కేగిన నక్కడకేగుటకు దాను సిద్ధపడెను. అంగదుని కిష్కింధానగరము నేలుమనిచెప్పి సుగ్రీవుడు పయనమయ్యెను. ఆ తనివెంట హనుమంతుడు, విభీషణుడు, జాంబువంతుడు మొద లుగాగల వేనవేలజనులు రాముని దర్శనమునకై వచ్చిరి. ఈ యంగటిలోను విభీషణుని, హనుమంతుని, జాంబవంతుని మా త్రము వెనుకనుంచి తక్కినవారితోగలిసి, అఖండసుఖము నను భవించుటకై శ్రీరామచంద్రుడు సరయూ నదిలోజొచ్చి పర లోకమునకు బోయెను.

ఇంతటి రామాయణము ముగిసెను.

( ఉ ప దే శ ము ) .

బిడ్డలారా! ఇంతవరకును రామాయణకథను మీకు జె ప్పినాను. మీరును శ్రద్ధతో వినియున్నారు. ఈ చరిత్రము

ను మీకొక్కచెవినివిని మఱొక్కచెవిని విడిచిపెట్టుట తగదు
మనమేదైన జదివినను, వినినను వానినిశ్రద్ధతో మనసున
ఉంచవలెను. పిమ్మట ఈ చరిత్రమున మనమునేర్చుకొనవలసిన
నీతులేవిఉన్నవోయని యాలోచించవలెను. ఆలోచించి, మం
చినీతిని కనుగొని, దానిప్రకారముగా నడచుకొనవలయు. అ
ప్పుడుకదా మీరేదైన చరిత్రము వినినందునను జదివినందు
కును ఫలముకలుగును! ఇప్పుడీరామాయణకథలో చూడుడు!
ఎన్నినీతులున్నవో! రామునివిషయమై మీరేమినేర్చుకొనవలె
ను? లక్ష్మణుని చరిత్రములోగల నీతియేమి? సీతవిషయమెట్టిది?
భరతునిమూలమున మీరు నేర్చుకొనవలసిన నీతియేమి?
హనుమంతుని చరిత్రమున నేమినేర్చుకొనవచ్చును? రావణుని
చరిత్రమునవలన మీరు నేర్చుకొనవలసిన నీతియేమి? ఇవన్నియు
మీరు నేర్చుకొనవలెను. లేదా? వీరివిషయమై మీరు నేర్చు
కొనవలసిన విధులు, నీతులు మీకిప్పుడే తెలిసియుండును.
తెలియనివారుకూడ కొందఱుందురు. మీ యందఱిమేలున
కై, యెవరివలననేమి నేర్చుకొనవచ్చునో అది స్పష్టముగ మీ
కు తెలియజేసెదము. అవిమనసులో జాగ్రతగాఉంచుకొనుడు;
అంతేకాదు! వానిప్రకారముగా ప్రవర్తింపుడు; తెలియనివారి
కి బోధింపుడు. అప్పుడు మీరురామాయణము చదివినం
దుకు ఫలముకలుగును! ఆ ఫలముకలిగినప్పుడు మీరెంత సంతో
షింతురో! ఈనీతుల ననుసరించి నడవకపోతిరా- రామాయణ

ము జదివి యేమిప్రయోజనము? కావున చదివినదానిని, వినిన దానిని, స్వయముగ ఆచరణలోనికు దేవలయును. అని మీ రిప్పుడు ఎవరివలన నేమి నేర్చుకొనవచ్చునో.. ఏమి నేర్చుకొన వలెనో చెప్పుచున్నాము- శ్రద్ధతో వినుడు:—

(రా ము డు.)

రామాయణమునకు నాయకుడు రాముడు. ఇతనిచరిత్రము వ్రాయబడి యుండుటవలననె రామాయణము అని పేరు కలిగెను. ఈ రామునికథవలన మీరేమి నేర్చుకొనవలెను? తల్లిదండ్రులయెడలను, గురువులయెడలను, పెద్దలయెడలను భక్తియుంచి వినయముతో ప్రవర్తింపవలెను; వారియెడల మర్యాద యుంచవలెను; వారుచెప్పినట్టు చేయవలెను; చదువునందు మనసుంచి శ్రద్ధతో చదువవలెను; శరీరమును దృఢముగ నుంచుటకై నియమముతో వ్యాయామము చేయవలెను; ఎవరియెడలను అన్యాయముగను క్రూరముగను ప్రవర్తింపకూడదు; ఎల్లప్పుడును నిజమేపలుకవలెను; పెద్దలుచెప్పుచున్న ప్రకారముగా జరుపవలెను- తనమనసులో ఇంకొకరీతిని జేయవలెనని యున్నప్పటికిని తనయిచ్ఛనువిడిచి పెద్దలుచెప్పినట్లు చేయవలెను. తనసోదరులను ప్రేమతో ఆదరింపవలెను. వారితో జగడమాడరాదు; సర్వదా సంతోషముతోనుండవలెను. వీనిలోనె నిజమైన ధర్మమున్నది; ఇందులోనె పుణ్యము

న్నది; ఇందుననే శుభమున్నది. కావున, మీరందఱును రా మునివలె బ్రవర్తించుటకు బ్రయత్నింపవలెను.

( ల క్ష్మ ణు డు ).

ఇతనివలన మీరేమి నీతినేర్చుకొందురు? తన సోదరు లయెడ పూర్ణమగు బ్రేమనుంచవలెను. వారికొఱకై యెట్టి సంకటములొదవినను సహించుటకు సిద్ధమైయుండవలెను. ఒక సమయమున అన్న కోపించినను, తిట్టినను, మరల తిట్టక ఓపిక తో ఓర్చియుండవలెను. అటుగాక, పోరుపెట్టుకొని కలహింప రాదు; ఏకార్యమును జేయుటకు ముందు బాగోగులు యోజించి చేయవలెను; ముక్కోపితనముకూడదు; తనసోదరులసౌఖ్య మే తనసౌఖ్యమని భావించవలెను; తనయన్నసంపదయే తన కు సంపదయని యెంచవలయు. ఈవిధముగా ఆనందముతో నుండవలెను.

( భ ర తు డు ).

భరతుడు సోదరప్రేమయొక్క అవతారమేయని చెప్ప వచ్చును. రామునికొఱకై యతడు రాజ్యమునొల్లడయ్యెను; గృహమునొల్లడయ్యెను; బంధువులనుబ్రేమింపడయ్యెను. ఇం తకన్నను సోదరులయెడలప్రేమ యింకెంత యుండును?

(సీ త.)

రామాయణకథకు రాముడెట్లు ముఖ్యపురుషుడో అ దేవిధముగ సీత ముఖ్యస్త్రీ. అనగా కథానాయిక. జనులంద

రు సీతను దేవిగా భావించి పూజించుచుందురు. ఎందువలన? ఆమె పవిత్రురాలు. ప్రవర్తనము పవిత్రము. మనసుశుద్ధము. రాముడరణ్యములకు బోవునపుడామెనయసున చిన్న అట్లుండియు పతియుదానను వేర్వేరు వస్తువులు కావనియు ఇరువురు నొక్కటేయనియు ఆమెకు దెలిసియుండెను. పదార్థమునుండిదాని నీడను వేరుచేయుటకు సాధ్యముకాదనిను, యెఱిగియుండెను. అదేప్రకారముగా బురుషుడు పదార్థము భార్య నీడయునై యుండవలెననియు దెలిసియుండెను. భార్యాభర్తల మనసులొక్కటిగా ఉండవలెను. ఒండొరులపై మిక్కుటమగు ప్రేమయుండవలయు- ఇత్యాదులామె బాగుగనెఱిగియుండెను. కావుననే అయోధ్యలో లేనిసుఖము కాననమున పతివెంట గలుగుచుండెను. కావున బతియే దైవము పతికి దెలియక యేపనియు జేయగూడదు. ఒక్కనిముసమైన ను పతినేమరకూడదు. అతడెందుండిన నందే భార్యకుసుఖము. చూడుడు. రావణుడామె నెత్తుకొనిపోయి ఎన్నివిధములనో ఆమెను బలాత్కరించెను. మంచిమాటలుచెప్పిచూచెను. ధనమిచ్చెదను రాజ్యమిచ్చెదను అని యెన్నివిధములనో ఆశ జూపించెను. తుదకు రోసి కోపముతో బెదరించెను. అందున కువ్యర్థముకాగా, నఱికివేయుదుననికూడ బెదరించెను సీతాదేవి యొక్కింతయైన భయపడెనా? రామునిమఱచెనా? ధనమునకు, రాజ్యమునకు లోభించెనా? లేదు. లేదు. లేదు.

కావుననే మహాత్ములు సైతము "మొదు బూజించుచుందురు. ఆమెవర్తనము నిష్కళంకమైనదని నొక్కి చెప్పిరి.

(హ ను మం తు డు (మా రు తి).)

స్వామికార్యమును శిరసావహించి భక్తితో నెరవేర్చుటలో హనుమంతునకు సాటియెవ్వరు లేరు. అతడు రామునాజ్ఞ బాలించుటలో దనప్రాణమునైనను లక్ష్యపెట్టలేదు. ఏకనిష్ఠతో నెఱవేర్చెను. యజమానునిహితము కోరుచుండినచే సేవకునకు లాభము కలుగును. యుద్ధములో వానరవీరులను బ్రతికించుటకును, రామలక్ష్మణులను మూర్ఛనుండి లేపుటకును ఎంతపెద్దకొండను మోసుకొనివచ్చెను! అంతవిస్తీర్ణమగు సముద్రమును దాటెనుగదా! ఏటికి? రామునాజ్ఞబాలించుటకు. కావున బాలులారా! ఒకానొకప్పుడు మీరు నుద్యోగముచేయుదురు. ఆయుద్యోగకార్యమును మనసుంచి, చేసి యజమానునిసంతోషపఱచిన మీకే లాభమగును.

(రా వ ణు డు.)

ఒక్కమనుష్యుడు తనజీవితకాలమున ఏమిచేయనచ్చునను సంగతి తెలిసికొనుట ఎంతఆవశ్యకమో, అదేవిధమున ఏమి చేయుదగదను సంగతిని తెలిసికొనుటకూడ ఆవశ్యకమే. రాముని గుణములను జదివితిరి. రావణుని గుణములను జదివితిరి. వీరియందెంతభేదమున్నదో చూడుడు. కావున, మనుజునకెంత ధనముండినను, ఎంతటి సంపదయుండినను ఎంతటి వీరుడైనను గర్వముతో పొంగదగదు. పరులను అవమాన

ముచేయకూడదు. ఇతరులసొమ్మున కాశ పడఁగదు. దురాచరణుఁడు కాఁగూడదు. ఏవిషయమునను ఏమరియుండఁగూడదు. పరహితమైనదాని నుపదేశముచేయువారిని తృణీకరింపరాదు. ఇతరులెవరైనను అందునను తనక్షేమమునుగోరు మిత్రులుగాని, బంధువులుగాని, తనయందున్న దోషములను గనిపట్టినవారి నైనఁ గలిగిన, వారినికృతజ్ఞతాపూర్వకముగ ఆదరించి, తనయందున్న దోషములను సవరించుకొనవలెను. ఏవిషయముగాని ముందు ఆలోచించియే చేయవలెను. తాఁజేయు పని అవిచారమువలన తనయొక్కయు తనకులముయొక్కయు వినాశమునకు కారణభూతుఁడు కాఁదగదు.

అనఁగా శ్రీరామునివంటి సుపుత్రులును, భరతలక్ష్మణులవంటి అనుకూలసోదరులును, హనుమంతునివలె స్వామికార్యమును నెఱవేర్చు సేవకులును నైయుండవలెను. రావణునివలె ఉన్మత్తులును, దురాచారులును, దుష్టులును కాఁగూడదు. స్త్రీలు సీతవలె పతివ్రతలును, పతియాజ్ఞనెఱవేర్చువారును, ధర్మశీలురాండ్రునై, సంసారము జరుపుచుండవలెను. ఇటుచేసినయెడల రామాయణము జదివినందువలన తమజన్మము సార్థకముకాఁగలదు. కావున ఈరామాయణమునందలి నీతులను నేర్చుకొని, వానిప్రకారముగా ప్రవర్తించుటకై దేవుఁడు మీకు సద్బుద్ధినొసఁగుఁగాక! మీకు పరమేశ్వరుఁడు చిరాయువొసఁగుఁగాక! మీరు ధనసంపదగలిగి, సుఖమున నుందురుగాక! అనిపరమేశ్వరుని బ్రార్థించుచున్నాము.

సమాప్తము.

MARKAPUR,

28-12-14.

*Dear Sirs,*

I am happy to express that your "Bala Bharatam amply satisfies one of the present needs of Elementary Schools and will surely repay the labour bestowed on its get up and publication. Its style is simple and yet forceful.

Yours

R. NARAYANA RAO, B. A. L. T.

---

**RAJAHMANDRY,**

20-1-1915.

*SIR*,

I am in receipt of your book "Bala Baharatam" with surely deserves a place in the libraries of elementary schools.

I have the honor to be,

Sir,

Your most obedient servant

P. RAGHAVENDRA RAO,

ఇయ్యది నాతికఠినమై నాతిసారళ్యమై మృదుపద గుంఫనలచే కథాంశమునరయు ప్రతి బాలునకును కడుంగడు చేయూతగా నొప్పునని నేజెప్పగలను. మరియు ఎలిమెంటరీ పాఠశాలలలోని విద్యార్థులకేగాక హైస్కూళ్లలోని III ఫారము మొదలు I ఫారంవరకుగల విద్యార్థులకును నిట్టి గ్రంథములు సులభశైలితో పఠనీయంబుగ నియమించిన నెంతయు సుకరంబులు. అన్యదీయ మతసాంఘిక వ్యాపారముల బోధించు నవలలకన్నను నిష్ప్రయోజకములగు పశుపక్ష్యాది జీవితముల నేవో కల్పింపబడుములతో బుణకరించు పాఠములకన్నను స్వమతాచారబోధకంబై స్వదేశ సుప్రసిద్ధంబై ధైర్యశౌర్యౌదార్యాది సకలసుగుణ మణులకు ఖనీభూతంబగు మహాభారత కథాశ్రవణమననాదులచే నైహికాముష్మిక సుఖంబులుగలుగునని యాంధ్రసోదరులకు వేరుగాఁ జెప్పవలయునా? అట్టి మహోత్కృష్టకథాంశంబు విద్యార్థిదశయందియే యలవరచుకొనుట హేమంబున కామోదంబుగలుగుటయే!

అయితే విద్యాశాఖాధికారు లంగీకరించిననే కొన్ని పాఠశాలలయందు పఠనీయముగ నియమింపబడిచే నిట్టి గ్రంథరా

జంబు నయ్యానికారుల యంగీకారనిమిత్తమై బనిపిననెంతయు సహకారిగానుండునని తలంచెదను.

ఇట్లు,

హారపనహళ్ళి. పాలప్రాడి నరసింహశాస్త్రి.

---

**GOOTY,**
*22nd June, 1915.*

*Dear Sir,*

I beg to thank you for your copy of "Bala Baharatam." I am glad to find it very much liked by young boys. The style is simple and clearly understable and the story is intelligently told. My young son of 12 years is very much interested in reading it and, I dare say, will be instructed. Your laudable enterprise in this direction will meet with public appreciation and encouragement, as it richly deserves.

I wish you will devote your talents and publish such useful little books for the instruction of all young boys and girls, and help in the building of their character, and thus promote the enlightenment and advancement of the country. Wishing you success,

I am yours,
Sincerely,
P. KESAVA PILLAI.

BELLARY,
26-1-15.

*Sirs,*

I thank you for the copy of 'Bala Bharatam' which you were kind enough to send me some time ago. The book is written in a plain simple style and is quite fit to be placed in the hands of boys of the I, II, & III Forms.

Yours faithfully,
A. BHIMACHAR.

---

NELLORE.
1-2-15.

*Dear Sirs,*

It is with extreme pleasure that I have gone through the 'Bala Bharatam' you were kind enough to send me.

The book is written in a simple style so as to suit the capacities of young boys. The matter is immensely useful and readable. Just the book to be placed in the hands of the pupils of Elementary Schools.

Thanking you for your kindness.

I am,
Yours faithfully,
M. HANUMANTHA RAO.

VIZIANAGARAM,
17-5-15.

*Sirs,*

I have the honour to state that I have gone through your 'Bala Bharatam' carefully. I find that the book is written in a very simple style suitable to standards 3 and above in the Elementary Schools. Parts of the book may be selected for general reading by the pupils of the third and upper classes with advantage. The way in which the well known story is told emphasizing on the important point of each discourse is admirable and even an inexperienced teacher can successfully teach any portion selected.

As you are an enterprising man, I hope you will not cease your efforts in the direction of bringing out Bhagavatam and Ramayanam. I am quite confident that they will be crowned with success.

I have the honour to be

**M. Suryanarayana Pantulu.,**

# BALA BHARATAM.

I have gone through the book called Bala Bharatam written by Mr. VASUDEV R. HASABNIS in detail and find it clear and simple in style and interesting not only to the

pupils in Elementary Schools but also to students of the higher forms as well as to the general readers.

The author left no stone unturned to make his book popularize in as much as it gives in a small space in a very easy style a comprehensive view of the whole of "Mahabharata" compiled in very big volumes which are too difficult to be grasped by majority of so called readers that were obliged to discontinue their studies in very earlier stages on account of poverty indifference and such-like reasons and thus I regard the book as one of the most useful contributions to the Telugu language in the present day as I am of opinion that several know nothing about the Puranas. I consider in my humble opinion that the book must necessarily find a place in the libraries of all Elementary as well as Secondary Schools as a general reading book as the readers will no doubt be able to have a thorough idea of the following viz, the names of some important personages, their heroic actions, their nature, the parts played by several, their good manners, good morals and in short the good characteristics that persons of all sorts ought to be possessed and lastly as to how to lead their lives in their present and after births.

Peddapuram, ACHANNA SASTRY.
28-5-1915.

